## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016349

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో **భారత ప్రభుత్వపు** సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కథకుల గాథలు

విద్వాన్, వేదము చంద్రశేఖరయ్య,
ప్రధానాంధ్రోపాధ్యాయుడు,
బెంటింకు బాలికోన్నత పాఠశాల,
వేపేరి, మదరాసు 7.




క్రైస్తవ వాఙ్మయ సమాజము

# వినతి

పాఠశాలలందు విద్యార్థు లాఱవ ఫారమునకు వచ్చుసరికి వారికిఁ గొంత రచనా కౌశలము, కల్పనా సామర్థ్యము నలవడుట సముచితము. ఇట్టి యభిప్రాయము ననుసరించియే పాఠ్యప్రణాళికలోఁ గల్పనాశక్తి యభివృద్ధి పఱచుటకుఁ గొన్ని యంశము లీయఁబడినవి. అట్టివి కథామూలకము లయి నచో సుబోధకములు.

బృహత్కథ (కథా సరిత్సాగరము) యిట్టి కల్పనా సామర్థ్యమును బెంపొందించు చిన్నచిన్న యుపాఖ్యానములతో నిండినదని వేఱుగఁ జెప్ప వలయునా! ఆ గ్రంథావతారికగఁ బ్రసిద్ధిచెందిన యీ భాగము, కథావతరణ మునకుఁ బ్రధానులగు వరరుచి, గుణాఢ్యుల వృత్తాంతములు గలది. ఇందు సహజము లెంతవఱకో చారిత్రకు లాలోచింపవలసిన విషయము.

చారిత్రక గ్రంథములనను గొన్ని కల్పనలు లేకున్న రాణింపవు. అట్లే యిదియుఁ గేవల కల్పనమని త్రోసిపుచ్చుటకు వీలుకానిది. వత్సరాజ చరిత్ర, ముద్రారాక్షసము మొదలగు రసవత్తర గ్రంథరాజముల కీ కథా సరిత్సాగరమే మూలము.

ఇంపలిస్థైలి అయిదవ, ఆఱవ ఫారముల విద్యార్థుల కుపయోగించునట్లు శక్తి వంచనలేక శ్రమించి రచించితిని. గుణదోషములకు పండితలోకమే ప్రమాణము.

వేదము చంద్రశేఖరయ్య.

# జాతీయ గీతము

జనగణ మన అధినాయక జయహే

భారత భాగ్య విధాతా ॥

పంజాబ సింధు గుజరాత మరాటా

ద్రావిడ ఉత్కల వంగా

వింధ్య హిమాచల యమునా గంగా

ఉజ్జ్వల జలధి తరంగా

తవశుభనామే జాగే తవశుభ ఆశిషమాగే

గాహే తవ జయ గాథా

జనగణ మంగళ దాయక జయహే

భారత భాగ్యవిధాతా

జయహే-జయహే-జయహే

జయ జయ జయ-జయహే

# వరరుచి

## ౧

సకల కులగిరుల నిరసించి, దేవతానికర నివాసభూమి యగు మేరువును బ్రతిఘటించి, యభ్రంకషంబుగ శృంగశృంగాటకములఁ బెంచి, కలశసంభవు శాపభయంబున నేలమట్టమయ్యుఁ, దన పూర్వపుటౌన్నత్యమును జాటు మహావృక్షముల తోడను, గన్నులకు విందుగూర్చు పొదరింటిగుంపులఁ బ్రకాశించు సానువులతోడను, శిఖరములనుండి జాఱి మలకలై లోయలవెంట జలజలమని ప్రవహించు సెలయేటి తుంపురుల వహించిన పిల్లగాలులతోడను, తపోనిష్ఠాగరిష్ఠులైన మౌనివరేణ్యుల యోగసమాధి కాశ్రయభూతములైన గుహాసముదయముతోడను, శుకపికశారికాది శకుంతసంతాన నిరంతరానంద కలకల నినాదములతోడను, బిఱీకిగుండియలవియునట్టి స్తనితసంకాశ భీషణఘోషంబుల సంచరించు మత్తమాతంగ పుండరీకవరాహమహిషాది క్రూరసత్త్వములతోడను నిండి వింధ్యాద్రి ప్రకాశించుచుండును.

అగ్గిరివర ప్రాంతకాంతార మధ్యంబున సకల జగదంబ యగు నంబకోవెల కలదు. వింధ్యవాసినినామ యగు నా కాళికాదేవి ప్రభావమునఁ దత్సమీప ప్రదేశమంతయు నపగత వైరమగు జంతు సంతానముతోడను, పుష్పఫలభరితములై నవనవోన్మేషమున నొప్పు వృక్షవితానముతోడను, వెలయుచుండును. ఆ గుడియెదుట నిర్మలమాధురీజలపూర్ణమగు నొక కమలాకరము కలదు. అందు జలవిహంగములు నానావిధ కోలాహలములు గావించుచుండును.

ఉన్నత వృక్షచ్ఛాయలచే నాచ్ఛాదితమగు నా యడవి మార్గమున, నఱువది వర్షముల వయస్సు దాఁటినవాఁడును, మహోన్నతకాయుండును, తేజస్వియు కొంచెము విచార మును సూచించు వివర్ణముఖము కలవాఁడును, 'వరరుచి'— 'కాత్యాయన' నామముల ప్రసిద్ధినొందినవాఁడును నగు బ్రాహ్మ ణుఁడు నిర్భయముగ నేఁగియేఁగి, యా పార్వతిగుడి సమీపించి, జలాశయంబునఁ గృతావగాహుఁడై, తత్కాలోచిత కృత్యం బుల నెఱవేర్చి, యిష్టసంసిద్ధికై దేవ్యాలయమును బ్రవేశించి, వేదోక్తవిధానమున నామెను బూజించి, తపోనియతి నుపక్ర మించెను.

అంతఁ గొంత కాలమునకు కాళికాదేవి స్వప్నమునఁ బ్రత్యక్షమై "వత్సా నీ తపంబునకు మెచ్చితిని. నీ కోరిక నే నెఱుఁగుదును. ఈ సమీపమున వింధ్యారణ్యమున నివసించు 'కాణభూతి' యను పిశాచరాజును దర్శింపుము. నీకు శుభం బగు"నని యాదేశించెను.

అతఁడు కాళివచనంబులకు ముదమంది, యొడలిబడలికఁ దీర్చికొని, కాణభూతిని దర్శింపఁ బయనమయ్యెను. కతిపయ దినంబు లటనటఁ ద్రిమ్మరి, యెట్టకేలకు జలమాకాంక్షించి తపో నియతినున్నవియో యననొప్పు శుష్క-వృక్షములను, ననా వృష్టిదోషంబున సర్వంబును బాడఱియున్న ప్రదేశంబును గడచి, యొక్క వటమహీరుహమును దిలకించెను. అయ్యది సకలవృక్షములను మోసగించి జలాహరణ మొనరించి స్వార్థతం దన్నుదాఁ బోషించుకొనుచున్నదో యనఁ గించిత్తే నియు వాడువాఱక, శాఖోపశాఖలఁ బ్రబలి యర్ధయోజన పర్యంతము వ్యాపించిన తన ఛాయలచేఁ బాంథులకు శ్రమాప

నోదము గావించుచు నానావిధ ప్రాణికోటి కాశ్రయభూతమై యుండెను.

సకల భాషాకోవిదుండగు వరరుచి యా వృక్షమూలము నుండివచ్చు కోలాహలము నాలకించి, తచ్ఛాయాశ్రయములై పిశాచములు నివసించునని గ్రహించి సమీపించెను. అటఁ గొన్ని పిశాచములు సేవించుచుండ ప్రభుతనెఱపు పిశాచ రాజును గాంచెను. మహోన్నత దేహమును, లంబోదరంబును, కుఱుచనాసికయు, జుంజుఱువెండ్రుకలతోడి తలయు, బూరకాళ్లును, చింతాకంత కన్నులును గలిగి, చూపఱకు భీతి గొలుపుచుఁ, బిశాచముల కానలిడుచుండు నాతఁడు వరరుచిని గాంచినదే యెదురేఁగి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, "మహాత్మా! మీరెవ్వరు? ఇటకరుదేరఁ గతమెయ్యది! మీ మొగంబు కొంచెము విచారమును సూచించుచున్నది. మీ మనోగతమగు వంత యెయ్యది? దారిబడలిక పోవునట్లీయాసన మలంకరింపుఁ"డని గౌరవించెను. వరరుచియు నాతని సౌమ్యతకచ్చెరువంది "యార్యా! నీ భాషణముదిలకింప నుత్తమమైనది. కాని నీ జన్మము పైశాచికము. ఇది యెట్లు సంభవమయ్యెనో? నా చెలిమిని బాటించి వివరింపఁగోరెద"ననవుడు నాతఁడిట్లని యెను.

"ఆర్యా! నాకు జన్మజ్ఞానము శూన్యము. కాని నేనుజ్జయినీ నగర శ్మశానవాటికల విహరించుచుండ, జగత్పితరులగు పార్వతీపరమేశ్వరులు విహారవశమున నచ్చటికేఁగుదెంచి యిష్టాలాప సందర్భమున నాడుకొనిన మాటలఁ జెప్పెదను. సావధానముగ నాలకింపుఁడు.

పార్వతీదేవి 'నాచే శాపమందిన పుష్పదంతుఁడను ప్రమథవరుఁడు మనయొద్ద కెప్పుడు రాఁగలఁ' డని ప్రశ్నింప, మహాదేవుఁడామె నుద్దేశించి, "దేవీ! చూచితివా! ఈ పిశాచాగ్రగణ్యుఁడు. ఈతఁడు కుబేరునిశాపముచే నిట్లయినాఁడు. ఎంత వలదనినను, స్థూలశిరుఁడను రక్కసునితో నెయ్యము పీడనందున, నీతనికీగతి కలిగినది. ఈ విషయమును వినిన యీతని యన్న దీర్ఘజంఘుఁడు వేఁడగా కుబేరుఁడు "గౌరీదేవి శాపముచేత మానవజన్మమందిన పుష్పదంతునిచే "బృహత్కథ" నాలించి, దాని నాకారణముచేతనే మానవుఁడైన మాల్యవంతునికి వినిపించిన విముక్తి నందు" నని మోక్షమును బ్రసాదించెను. నీవును బుష్పదంతుని కట్టి శాపముకదా యొసంగితివి?" అని నుడివెను. నేనావిషయము నాలకించి, సంతసంబున నిట కేఁగుదెంచితిని. ఇఁక నాశాప మాపుష్పదంతునిచేఁ బరమేశ్వరప్రోక్తమగు బృహత్కథ నాలించు పర్యంతముండును."

ఈ వృత్తాంత మాలకించిన వరరుచియుఁ, దనకుఁ బూర్వజన్మజ్ఞానము కలుగఁగా, "మహాశయా! శాపవశంబున మానవుండనైన పుష్పదంతుఁడను నేనే. వినవలతువేని పరమేశ్వరునిచేఁ బార్వతికిఁ జెప్పఁబడిన బృహత్కథను వివరింతు" ననఁగాఁ గాణభూతి "యయ్యా! భవద్దర్శనంబున నాశాపము తీరినట్లే యున్నది. నీవు సాక్షాన్మహేశ్వరాంశ సంభూతుఁడవు. కాకున్న నీ దీర్ఘమైన మహాకథను దెలుప నెవరుపక్రమింతురు? కథానివేదనానంతరము నీకు శాపవిమోచనంబయి ప్రమథులలోఁ గలియుదువు. నీ మానవజన్మ వృత్తాంతము నాలకింపవలయు నని కుతూహలము కలదు. శ్రమమని భావింపవేని తెలుపఁ

గోరుచున్నాను" అనఁగాఁ గాత్యాయనుఁడు తన మానవజన్మ
వృత్తాంతము వివరింపఁదొడఁగెను.

౧

ఆర్యా! కలదుకదా కౌశాంబీమహానగరము? అది వైభవ
జితవైజయంతమన నొప్పుచుండును. అరి దుర్భేద్యములగు
కోటగోడలతోను, ఆకాశమునంటు మహోన్నతములగు
సౌధములతోడను, దిద్దితీర్చినట్లున్న రాజవీథులతోడను, నానా
విధములగు పూవులు, పండ్లు, చిగురులతో వెలయు తరులతా
వితానముల నొప్పు నుద్యానవనములతోడను, వీథివీథుల
దేవాయతనములతోడను, వేదవేదాంగ బహు పురాణ
శాస్త్రార్థవిదులైన బ్రాహ్మణులతోడను, ధనుర్విద్యావిశారదులైన
క్షత్రియకుమారులతోడను, నిరంతర కృషివాణిజ్య పశుపాల
నాది కార్యవ్యాపృతులైన వైశ్యులతోడను, వైరివీరభయంకరు
లైన యోధవర్యులతోడను నాపట్టణం బసమానంబై యల
రారుచుండును.

ఆ నగరమున సోమదత్తుఁడను బ్రాహ్మణోత్తముఁడు
కలఁడు. ఆతని యింట నెప్పుడు నగ్ని వేల్వఁబడుచుండుటచే
నగ్నిశిఖుఁడనియు నాతని కన్వర్థనామము కలదు. అతఁడు
యజనయాజనాది షట్కర్మనిరతుండును, నిరంతర వేదాధ్యయన
పరాయణసచ్ఛాత్ర పరిసేవితుండును, అతిథ్యభ్యాగత పూజా
పరతంత్ర మానసుండునునై వెలయుచుండును. అతని భార్య
వసుదత్త యనునామె. భర్తమాట కెదురాడని సాధ్వి. శాప
వశంబున జన్మించిన మునికన్య. ఆ పుణ్యదంపతులకు శాప
వశమున నేను పుత్త్రుఁడనైతిని. అదియు నా పుణ్యవిశేషము
కదా!

నే జనించిన కొలఁదికాలముననే నా జనకుఁడు నన్ను, నా తల్లిని దుఃఖసాగరమున ముంచి, యిహలోక సౌఖ్యముల వీడి, పరలోకగతుండయ్యెను. మివుల విచారించియు నెట్లో నావలని సుఖములు వడయుతలంపున నా జనని, తన దుఃఖ మడంచుకొని, జీవయాత్ర సాగించుచు నన్నుఁ బోషించు చుండెను. నేను పంచవర్ష వయస్కుఁడను కాఁగా, నా విద్యా భ్యాసమునుగూర్చి యామె మిక్కిలి విచారించుచుండెను. కాని నే నావయస్సుననే శ్రుతధరుఁడనై యుంటిని.

ఇట్లుండ నొకనాఁడు మాయింటి కిరువురు బ్రాహ్మణ కుమారు లాతిథ్యమపేక్షించి వచ్చి, వీధిగుమ్మమున మృదంగ నాద మొనరించిరి. ఆ శబ్దమాలించి, మాతల్లి తన భర్తచెలి కాఁడు వచ్చెనని విచారించి, నాతో సంగతి చెప్పుచుండెను. నేను సాంతము విని యామెంగాంచి, "యమ్మా! నన్నుఁ బంపుము. వారి యాటపాటలను నీకు మఱలఁ జెప్పెదను" అను చుండ వా రాశ్చర్యమగ్నులై, నన్నుఁగూర్చి ప్రశ్నించిరి. మా తల్లియు "నీతఁడు పలుకునది సత్యము. ఒక్కమారు విని నంతనే సర్వమును జ్ఞాపకముంచుకొనఁ గలఁ"డనఁగా, వారును బరీక్షార్థ మొక గ్రంథమును నాయెదుటఁ బఠించిరి. నే దాని నేమాత్రము విడువక వారి యెదుటనే మా యమ్మదగ్గఱఁ బఠించితిని. పిదప వారి నాట్యమును దిలకించి యా యాట పాటల నాయమ్మకుఁ జూపితిని.

అంత వారు మాతల్లిని సమీపించిరి. అందు 'వ్యాడి' యను నాతఁడు "అమ్మా! యీతఁడింద్రదత్తుఁడు. నేను వ్యాడి యనువాఁడను. మేమిద్దఱము స్నేహితులమో యట్లే మా తండ్రులగు దేవస్వామి కరభకులు మిత్రులు. నే జనించిన

కొలఁది కాలమునకు నా తండ్రి స్వర్గస్థుఁడు కాఁగా స్నేహితుని మరణమువినిన యీతని తండ్రి మహాప్రస్థానయాత్ర వెడలెను. పతివ్రతలగు మా తల్లులు తమ భర్తల ననుగమించిరి. మేము ధనికులమయ్యు విద్యావిత్తములేక దిక్కులేనివారమై తిరుగుచు నెట్లైన విద్యార్జన చేయవలయునను తలంపున కుమార స్వామిని గూర్చి తపమాచరించితిమి. స్వామియు మా తపంబునకు మెచ్చి స్వప్నమున సాక్షాత్కరించి, "వత్సలులారా! మీ తపోనియమము సంతసమును గూర్చెను. మీ కోరిక నాకుఁ దెలియును. మీకు విద్యయందాసక్తికలదేని నందరాజధానియైన పాటలీపుత్రమునకుఁ బొండు. అచ్చట "వర్షుఁ"డను పేరుగల బ్రాహ్మణుఁడున్నాఁడు. అతని ముఖమున నెల్లవిద్యలు గ్రహింపఁగల"రని యంతర్ధానమాయెను.

మేమప్పుడే విద్యార్జనము చేసినవారివలె సంతసించుచుఁ బాటలీపుత్రమును బ్రవేశించి, యందు వర్షోపాధ్యాయునిఁ గూర్చి విచారించితిమి. గాని యెవ్వరును మాకాతని జాడ తెలుపరైరి. పట్టుదలవిడువక మేము ప్రతివీధియు, సందును వెదకుచుండ నొక క్రంతలోఁ బూర్తిగా శిథిలదశయందుండు నొకగృహమును గాంచి. యెవ్వరిదని విచారింప, వర్షోపాధ్యాయునిదని తెలిసినది. ఆ యింటి పరిస్థితి యేమి చెప్పుదును? ఎలుకకన్నములతోడను, జీమలపుట్టలతోడను, సూర్యచంద్రులకు నివాసభూమియయి, చూడ నసహ్యముగా నుండెను. రెండవనరకమో యననొప్పు నాయింట నొకమూల ధ్యాననిమగ్నుఁడై వర్షుఁడుండెను. లోపల స్త్రీలున్నారేమో యని పరికింప నాతని వలచివచ్చిన దరిద్రదేవతయో యనునట్లు, దీనవదనముతోడను, ప్రాఁత చిరుఁగుచీరతోడను, బక్కచిక్కిన

శరీరముతోఁడను నొప్పు నాతని యిల్లాలిని జూచి, యామెచే నతిథిసత్కారముల నంది, మేమరుగుదెంచిన కార్యమును సవివరముగా నివేదించితిమి. ఆమెయు సంతుష్టమానసయై యిట్లని యెను.

"పుత్రకులారా! మీ యాగమనాశయము పొగడఁదగినది. మొదట నా భర్త యీ పట్టణమందలి మూర్ఖులలోఁ బ్రథముఁడు. వర్షుఁడనుపేరు మూర్ఖునకుఁ బర్యాయమై వ్యవహరింపఁబడుచుండెను. అట్టి మూర్ఖుని జూచి, ప్రజ లనవరతము పరిహసించుచుండ, నా పరిహాసములను, జననిందను భరింపఁజాలక, వింధ్యాద్రికరిగి, కుమారస్వామిని గూర్చి తపమాచరించి, యాతని కరుణచే సర్వశాస్త్ర పారంగతుఁడయ్యెను. కాని యా దేవదేవుఁ డొకనియమము నాదేశించెను. అదే మనఁ "దొట్టతొలి నీవొక శ్రుతధరుఁడగు వానికి విద్యాబోధన చేయవలసినది. అట్లైననే నీకీవరము ఫలించును" అని. కావున మీకు విద్యార్జనయందుఁ గుతూహలముకలదేని, నీతనికి శిష్యులు కాఁదలఁచితిరేని, శ్రుతధరు నొకనిఁ గష్టమనక వెదకితెండు" అని చెప్పెను.

అంత మేమామె పలుకుల కానందమంది తత్కాల దారిద్ర్యమును బోఁగొట్టి, శ్రుతధరునికై, పట్టణములు, పల్లెలు, దేశమెల్లెడల వెదకుచు నిచ్చటికివచ్చితిమి. మా భాగ్యవశమున నీతని గంటిమి. ఇఁకఁ దల్లీ! నీవనుమతించినచో నీ దయచేత నీతఁడును మేమును వర్షోపాధ్యాయుని యనుగ్రహమున సర్వ విద్యాపారంగతులము కాఁగలము. ఇందుల కొడంబడవలసిన" దని యనేక విధముల ప్రార్థీయ పడెను.

నా తల్లి నా యెడఁబాటునకు మనమున విచారించినను, నా విద్యాసముపార్జనమే తన యభీష్టమును, తన యభ్యుదయమునకు రాచబాటయు నని యెంచినది; కాన మనోగత విచారము వెలికిఁ గానరానీక నన్నంపుటకు సమ్మతించెను.

3

మఱునాఁటి వరువాత మా తల్లి కాల్యకృత్యముల నెఱవేర్చుకొని నన్నుఁ జేరఁబిలిచి "కుమారా! పిన్నవయసువాఁడవు. నన్ను విడిచి యెప్పుడు నున్నవాఁడవు గావు. ఇప్పు డీ ప్రాంతమునే విడిచి దూరమేఁగ నున్నావు. ఎచ్చటి కేఁగినను, నీ తండ్రి నిన్నాశీర్వదించుచునే యున్నాఁడు. నా యెడబాటువలని చింతమాని విద్యార్జనయం దాసక్తి కలిగి, గురువులయెడ వినయవిధేయతలతోఁ బ్రవర్తింపుచుండుము. ఈ యిరువుర నీ సోదరులవలె నాత్మఁ దలఁచి స్నేహము పాటింపుము." అని బోధించి, వ్యాడీంద్రదత్తులఁ జూచి, "నాయనలారా! ఈతని మీ సోదరునివలె భావింపుఁ"డని చెప్పి యొప్పించెను.

అంత మేమును సన్నద్ధులమై, గ్రామములుఁ, బట్టణములు, నదీనదంబులుఁ, గాంతారంబులును దాఁటుచుఁ బయనించుచు, నందందుఁగల వింతల నరయుచుఁ, గొన్ని దినములకు నందరాజధానియగు పాటలీపుత్రమును జేరుకొంటిమి. అట నవధి లేక వర్షోపాధ్యాయుని దర్శించి మా యాగమన కారణ మాతనికి విన్నవించితిమి.

వర్షోపాధ్యాయుఁడు నన్నుఁ గుమారాంశ సంభూతునిఁగాఁ దలంచి, సుముహూర్తమున నొక పవిత్ర స్థలమునఁ గూర్చుండఁ

బెట్టి యోంకారముతో విద్యాబోధ కుపక్రమించెను. వేద వేదాంగ శాస్త్రపురాణేతిహాసముల నాతఁడు క్రమముగ నుపదేశించెను. గురుముఖమున నేనును, మా యిరువురి ముఖమున విని వ్యాడియు, ముష్మారాలకించుటచే నింద్రదత్తుఁడును సర్వ విద్యల గ్రహించితిమి.

ఎప్పుడును వేదఘోషలేని యా ప్రాంతమున మాయుపూర్వ సుశ్రావ్య వేదగానమునకు మహాద్భుత నిమగ్నమానసులై యచటి విప్రవరులు దర్శించి, మమ్మును, మా యుపాధ్యాయుని నభినందించిరి. వర్షోపాధ్యాయుని కీర్తి దశదిశల వ్యాపించి నందమహీపాలు సభాకూటమును బ్రవేశించెను. నందుఁడు దివ్యప్రభావసంపన్నుఁడైన మా గురువును గౌరవించి, యాతనికి ధనకనక వస్తు వాహనాముల కానుక లొసంగెను. ఈ సన్మానములఁ గాంచి, పాటలీపుత్రమందలి యుపవర్షుఁడను మా యుపాధ్యాయసోదరుఁడు దక్క, తక్కిన వారందఱు నందుని యీావికి, మా గురుని పాండిత్యమునకు సంతసించి కొనియాడిరి.

ఇట్లు మా విద్యావైశద్యమును, వర్షుని కీర్తియు దినదినాభివృద్ధిఁ గాంచుచుండెను. ఆ పట్టణమున నందుని యానతిచేఁ బ్రతివర్షము నింద్రోత్సవము జరుగుట యలవాటు. ఆ సమయమున నెల్లరును దమతమ గృహాసీమల నానావిధముల నలంకరింతురు. ఉద్యానవనములఁ బలురకములగు దోహదక్రియలఁ బుష్పపల్లవభరితంబు లొనరించి, చూపఱులకానందము కలిగింతురు. దేవాగారముల నుత్సవములఁ గావింతురు. ప్రపంచమందలి వివిధవస్తువులఁ దెప్పించి ప్రదర్శింతురు. ఎడనెడ నృత్తవాద్యనాటకాది మనోల్లాసకర

ప్రదర్శనముల వెలయింతురు. నానాదేశాగతులైన ప్రజా నీకముచే నగరము శోభాయమానముగ నుండును. ఆ యుత్సవమునఁ బౌరులెల్లరు విచ్చలవిడి వినోదములలోఁ బాల్గొనుచుందురు. స్త్రీ పురుష భేదము లేక తిరుగుచుందురు.

నేను నా చెలికాండ్రగు వ్యాడీంద్రదత్తులతో నాయుత్సవమును దిలకింపఁ బురమునఁ బ్రవేశించితిని. వినోదములఁ బరికించుచు, నొకచో యెడ, నుత్సవమును జూడ వేడుక పడి యరుదెంచిన శచీదేవియో, దక్షిణనాయకుండగు హరిపైఁ గోపించి భూమి కవతరించిన లక్ష్మీదేవియో, సర్వమానవ మానసమథన మదనధిక్కారముచే నిలువెడలి వచ్చిన రతీ దేవియో, సవతి మచ్చరము పైఁపఁజాలక వెండికొండ వీడి యరుదెంచిన పార్వతీదేవియో యన సర్వలక్షణ లక్షితయగు నొక యుత్పలాక్షిని గాంచి, విస్మయముతోడ విభ్రమము తోడ నిశ్చలుండనైయుండ నింద్రదత్తుఁ డిట్లనియె. "ఓయి మిత్రుఁడా! ఏమి కాంచెదవు? మదనుని యస్త్రమువలె పురుష హృదయములఁ గొల్లలాడు నా యువతి నీ విభ్రమమునకుఁ గారణమని తలంతును. ఆమె యెవరో యెఱుఁగుదువా? మన యుపాధ్యాయుని తమ్ముఁడుపవర్షుని కూతురది. నీకామెయం దనురాగము జనించినదా?" యన మేలుకొన్నవానివలె

యెట్లో యింటికరుదెంచితిని. నాఁటినుండి నా హృదయ మా సుందరాంగిపైఁ దగుల్వడి వేఱొండేదియుఁ జింతింపదాయెను. నాల్కకు రుచి లేదు. కంటికిఁ గూర్కు లేదు. విద్యాభ్యాసము లేదు. బ్రహ్మచారులతో వాదోప వాదములు లేవు. ప్రియమిత్రులగు వ్యాడీంద్రదత్తులతో సల్లాపములు లేవు. అన్ని విధముల వికలమానసుండనై

కాలముఁ బుచ్చుచుంటిని. నానాఁటికి విచారభారమునఁ గృంగుచు, క్షీణించుచున్న నన్ననేక విధములఁ బ్రశ్నించియు, మద్గురువరుండు కారణం బెఱుఁగలేక పోయెను.

అనంతర మొకనాఁటి నిశాసమయమున నా స్వప్నమున, ధ్వళాంబరధారిణియు, వీణాపాణియు, నగు నొక చెలువ సాక్షాత్కరించి, "వత్సా! నీ మనస్సును గలఁతవెట్టుచున్న యుపవస్తుని కూఁతు రుపకోశ నీ పూర్వజన్మపత్ని. ఈ పుట్టువునందును నామె నీకు సహధర్మచారిణి కాఁగలదు. సందియము వీడుము. నేను నీ యారాధ్య దేవత, భారతిని. నీ మనోవ్యథ నివారింపఁబూని యిట్లుపదేశించితి" నని పలికి యంతర్ధానమాయెను.

నేను మేల్కాంచి, యానంద సాగర తరంగముల నోలలాడుచు, నెప్పుడుదయమగు, నెప్పుడుపకోశ గృహాభిముఖుఁడనై చని యామెను దర్శింపఁ గలుగుదునని యువ్విళ్లూరుచుంటిని. నా మనోగతము నెఱిఁగి నన్నుఁ బ్రబోధించునవి పోలెఁ గుక్కుటంబులు కూసెను. నా మనోవిచారము తొలఁగునట్లు చీఁకటులు విరిసెను. నా ముఖ వికాసమువలెఁ దూరుపుదెస తెలివిసందె. నా హృదయమునఁ బెంపొందు రాగమువలె నరుణ దీధితులతోఁ బ్రభాకరుఁడు భాసించెను. అంత కాల్యములు నిర్వర్తించి, యుపకోశగృహాభిముఖుండనై యేఁగి తత్ప్రాంతోద్యానవనమున విహరించుచు 'నామె నెట్లు చూడఁగలుగుదునా' యని విచారించుచుండ నొక చెలిమికత్తియవచ్చి "మహాశయా! నేనుపకోశ చెలిని. ఆమె మీ యందు బద్ధానురాగయై పడుపాటు లేమని వచింతును? మిమ్మే

నాఁడు దర్శించినదో యప్పటినుండి నిద్రాహారములకు స్వస్తి. అలంకారములు సేయదు. చేసినను నస్తవ్యస్తముగ నుండును. ఇంత యేటికి? ఆమె యున్మాదినియై సర్వము మఱచినది. నీ చెలిమి లేనియెడల బ్రతుకుటయే దుర్లభము. పాల ముంతువో నీట ముంతువో, నీదే భార"మని నుడివెను.

అంత నేనించుక యాలోచించి "యోతలోదరీ! నేనును మీ చెలివలెనే బాధపడుచున్నాఁడను. ఇందు నేఁజేయఁగల దేమియు లేదుగదా! పెద్దలకు తెలియక యెట్లు వివాహము పొసఁగును? మీ చెలితోఁ దనతండ్రి కీ విషయ మేలాగుననైనఁ దెలియునట్లు చేయుమనుము. ఆతఁడందులకుఁ దగిన ప్రయత్నము లాచరించి మా వివాహము నెఱవేర్పఁగలఁడు" అని కార్యాలోచనము తెలిపి యింటికి మఱలి యెప్పటియట్ల యుంటిని. రెండు మూఁడు దినముల యనంతర ముపవర్షుఁడు నా గురుని యింటికివచ్చి నా వివాహ ప్రస్తావన చేసెను. వర్షోపాధ్యాయుఁడు నాసమ్మతిపై నంగీకరించెను. ఇంద్రదత్తుఁడు మా తల్లిని గొనితేఁగా, నొక శుభముహూర్తమున మా యనురాగ బంధసూచకముగా మంగళసూత్రధారణముఁ, బాణిగ్రహణమును జరిగెను. నేను వర్షోపవర్షులకుఁ బ్రీతుండనై గృహిణీసత్కారములఁ గొనుచుఁ జెలికాండ్రగు వ్యాడీంద్రదత్తులతో విద్యావ్యాసంగములు సేయుచుఁ గొంతకాలము గడపితిని.

నాసబ్రహ్మచారులలోఁ బాణిని నా నొకఁడు గలఁడు. అతఁడెంత తేజస్వియో యంత మూర్ఖుఁడు. విద్యావిషయమున నంతటి మూఢుని నేఁగాంచి యెఱుఁగను. అట్టి ఛాత్రునిఁ దనయింట నుంచుకొనుట కిష్టములేకయుఁ, బ్రయోజనము నందని యాతని యుపచారములకు సమ్మతింపకయు, మా

గురుపత్ని యాతని వెడలనడఁచెను. పాప మా మూర్ఖుని కొండంత యాస కూలిపోఁగా హిమవన్నగమున కేఁగి పరమేశ్వరునిగూర్చి తపమాచరించెను.

భక్తసులభుఁడగు మహాదేవుఁడాతనికి సాక్షాత్కరించి, వరములు వేఁడుమనఁ బాణిని తనకు విద్య కావలయునని ప్రార్థించెను. భక్తమందారుఁడగు నీలకంఠుఁడు వానికొక క్రొత్త వ్యాకరణమును బ్రసాదించి యంతర్ధాన మాయెను. వరగర్వితుఁడగు పాణిని తిరిగివచ్చి వాదమునకు నన్నుఁ బిలిచెను. నేనును వెనుదివియక యేడుదినములు వాదించి యాతని నోడించితిని. కాని చంద్రశేఖరుఁడు తన వరము భగ్నమైనందులకు నభమునుండియే హుంకారము గావింప మా వ్యాకరణములన్నియు నష్టమై మూఢులమైతిమి. పాణిని యజేయుఁడయ్యెను. శ్రుతధర శక్తిచే, వర్షోపాధ్యాయుఁ డనుగ్రహింప గ్రహించిన విద్యయంతయు నశించినందులకు విచారించి, యాశ్రిత వత్సలుండగు నా శంకరునిగూర్చియే తపమాచరింప, నా సర్వధనమును హితుఁడగు హిరణ్యగుప్తుఁడను వైశ్యకుమారున కప్పగించి, కుటుంబ రక్షణము గావింపఁ గట్టడచేసి మంచు గుబ్బలి కేఁగితిని. నా భార్య యుపకోశయుఁ బతివ్రతా ధర్మము ననుసరించి, నా క్షేమ మాకాంక్షించి, ప్రతిదినము గంగాస్నానము, వ్రతములు, నతిథి సత్కారములు గావించు చుండెను.

౪

అంత వసంతమేఁగుదెంచెను. సర్వ ప్రకృతియు నవ నవోన్మేషమై నయనానందకరమై విరాజిల్లుచుండెను. పికమొడఁ గాంచినను వసంతగానము చేయుచు స్వాగతమొసఁగు శకుంత

సంతానముల కలకలనినాదములే వీనులవిందుగా వినవచ్చు చుండెను. శీతలమందానిలుండు పుష్పరజఃస్పర్శచే మలినుఁడయ్యు హాయినే కూర్చుచుండెను. పట్టణమున వసంతోత్స వోద్యోగము నిరాఘాటముగ సాగుచుండెను. ఎల్లరును బ్రఫుల్లవదనములతో నుత్సాహపూర్ణులై పాల్గొనుటకుఁ బ్రయత్నించుచుండిరి.

ఉపకోశయు నలవాటుచొప్పున గంగాస్నానమున కేఁగుచుండెను. పాండురక్షౌమమనోహరాంగియై, తెల్లని దువ్వలువలు ధరించి, మదనుని కుసుమేతరంబగు నాఱవయస్త్రమో యన నెల్లర దృష్టులు దనవైపు ప్రసరింపఁగా గంగానది కేఁగుచుండెను. అట్టి మోహనాంగిని దర్శించి మదనబాణపీడితులై రాజపురోహితుఁడు, కొత్వాలు, మంత్రికుమారుఁడును వేర్వేఱ సమీపించి, తమ హృదయగతాభిప్రాయములను వెలువరించిరి. ఆమెయు వారిని యుక్తిచేఁ దప్పించుకొనుటకును, బరకాంతాలోలురగు వారికిఁ బాఠము నేర్పుటకును నొక యుపాయమును బన్ని "యయ్యా! నా భర్త దేశాంతరగతుఁడు. నేను నీవలెనే మన్మథాగ్నిని గ్రాఁగుచున్నాను. నీభావము నా కభీప్సితంబ. ఇట్టి రాచబాటలలో సరసములాడుట నింద్యముకదా! మన మర్యాదలు పోవును. కావున నీ వసంతోత్సవమున నందఱు నిమగ్నులైయుండ మద్గృహంబునకు ర" మ్మని సరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయ యామములు గడువులువెట్టి యిలు సేరెను. ఆనాఁడతిథిపూజార్థము కొంత ధనమావశ్యకమై నా మిత్రుఁడగు హిరణ్యగుప్తునికడకుఁ జేటిక ననుపఁగా నా మందభాగ్యుఁడు తానే వచ్చి "మోయింతీ! ఎంతకాల మిట్లొంటిఁ దపమాచరింతువు? పడుచుకాలమున సుఖముల

ననుభవింపక నీ మగఁడు హిమాలయమునకేఁగి తపముసేయు చున్నాఁడు. నీవు గంగాస్నానములఁ గాలము గడపుచున్నావు. ఇది యెంత సమంజసము? నీయందలి కరుణచేఁ జెప్పుచున్నాను. నాకోరిక నెఱవేర్పుము. నీభర్త యిల్లడయుంచిన ధనమేకాక, సమస్త వస్తువాహనములతో నీయిల్లు నింపెదను. లేనియెడల నాక చిల్లిగవ్వయైన నొసఁగ" ననెను.

ఆయింతియు, న్యాసధనమునకు సాక్షులు లేనందునఁ జేయునదిలేక పాపాత్ముఁడగు వైశ్యునిఁ జూచి కోపదుఃఖములు పెనఁగొన మనంబున నిట్లని చింతించెను. "అక్కటా! మగఁడు దేశాంతరగతుఁడైన నాతి యెంతయలక్ష్య మీ ప్రపంచమునకు? దుర్మార్గులగు నీ నలువురికి నేదేని శాస్తిచేయనిది బుద్ధిరాదు. ఈ హిరణ్యగుప్తుఁ డెంత దుర్మార్గుఁడు? నాధనము నాకిచ్చుటకు సాక్షులు లేనికారణమున నీయవినీతికిఁ జొచ్చినాఁడు. కానిమ్ము, ధర్మమవలంబించి వీరికి బుద్ధిగఱపెదను" అని తలఁచి వాని నాలవయామమున రమ్మని గడువుసెప్పియంపి, తన చెలికత్తె యలఁ బిలిచి యొకకాఁగునిండుగఁ గాటుకద్రవ్యమును జిక్కఁగఁజేయించి, నాలుగుగోఁచుల నా కాటుకలోముంచి యాఱవైచియుంచెను. ఒక పెద్ద బోషాణపుఁబెట్టియ వట్టిదిగాఁ జేయించి యుంచెను.

అంత సూర్యుఁ డీయధర్మప్రపంచమున నెక్కుడుకాల ముండరాదను తలంపుననోయన నస్తంగతుఁడయ్యెను. రాజ పురోహితాది దుష్టచతుష్టయము తమకళంకము నీవన్నెతోఁ బ్రకటించుకొందుఱనఁ జీఁకటులు బలిసెను. అచ్చటనచ్చట ధర్మప్రవర్తకులు లేకుండరని లోకమునకుఁ జాటునట్లు చుక్కలు

వాడమెను. పతివ్రతాముఖవికాసము వెల్లివిరియునట్లు చంద్ర మండల ముదయించి వెన్నెలలు నలుగడల వ్యాపించెను.

ఎప్పుడెప్పుడు సాయంకాలమగును, ఎప్పుడుపకోశ కౌఁగిట సౌఖ్యమనుభవింతమని యువ్విళ్లూరుచుండు పురోహితకుమారుఁడు విలాసముగ నలంకృతుఁడయి, యామెయింటికి వచ్చెను. ఉపకోశ చెలిమికత్తియలు స్వాగతమువలికి, లోనికింగొని పోయిరి. ఉపకోశయుఁ గపటప్రియంబున నాతని నాహ్వానించి "యోవిలాసపురుషా! నా సౌఖ్యమభిలషింతువేని ముందుగ నభ్యంగన స్నానమాచరించి రమ్మని వచించెను. సఖులాతని భూషణాంబరములూడ్చి చీఁకటిగదిలోనికిం గొనిపోయి, కాటుక గోఁచినిచ్చి గూనలోని కాటుకద్రవ్యముతోఁ దలయంటు చుండిరి. అతఁడు వారి కరతాళధ్వనులకు మైమఱచి, యానం దించుచుండెను. ఇంతలోఁ బ్రథమయామము గడచుటయుఁ గొత్వాలు తనయధికారమును జాటుచుఁ దలుపుతట్టెను. ఆ ధ్వనికిఁ బురోహితుఁడు భయపడుచుండ, నాతనిని బోషాణ ములో దాఁచిరి. తరువాతఁ గొత్వాలు నాహ్వానించి, పూర్వోక్త మర్యాద లొనరించుచుండ రెండవజాము గడచెను. ఇంతలో మంత్రికుమారుఁడు రాఁగాఁ గొత్వాలును బెట్టెయలోఁ బెట్టి, యా మన్ననలన్నియు నీతనికి జరిపిరి. చతుర్థయామ మగుడు హిరణ్యగుప్తుఁడు వేడుకమీఱ వేషాలంకరణము లొనరించి, యరుదెంచెను. చేడియలు భయమంది మంత్రిపుత్రుసితో నివేదింప నాతఁడు "హిరణ్యగుప్తుఁడు వరరుచి మిత్రుఁడు గదా! అక్కటా ఇప్పుడేమి సేయువాఁడ?" నని వగచుచుండ నామగువ "లయ్యా మీరీపెట్టెయలో దాఁగు"డని యోచన

చెప్పిరి. వారి మాటలనమ్మి మంత్రిపుత్రుఁడు పురోహిత కుమార, దండనాథులకుఁ దోడికాఁపయ్యెను.

ఉపకోశ హిరణ్యగుప్తుని గారవించి, లోనికిం గొనిపోయి, బోషాణమునెదుట నిలిపి, "ఆర్యవర్యా! నా ధనము మాట యేమి?" అని యడిగెను. అతఁడు "సుందరీ! తెలిపితినిగదా! నీభర్త నాయొద్ద న్యాసముంచిన ధనమునిత్తునని. మఱల నుడువ నలయునా?" యని యచ్చట నెవ్వరు లేరనుధైర్యమున బిగ్గ ఱగాఁ బలికెను. ఆమె బోషాణమువైపు తిరిగి "ఓ దేవత లారా! వింటిరా! హిరణ్యగుప్తుని వాక్యములు?" అని పలికి, దీపమార్పివైచి, వానిని దన సేవకురాండ్రకప్పగింప వారా మువ్వురికి జరిపిన మర్యాదలు జరుపుచుండ సూర్యోదయ మాయెను. వారాతని "నయ్యా! సూర్యోదయమాయెను. మీరిఁక వెడలనచ్చు"ననిరి. హిరణ్యగుప్తుఁడు కొంత తటపటా యింపఁగా, నర్ధచంద్రప్రయోగముల నాతని వెడలనడఁచిరి.

మూర్తీభవించిన పాపపుంజమో యనఁ గాటుకనూనియచే మర్దింపఁబడి నల్లనైనశరీరముతోఁ బిశాచమువోలె నాతఁడు మానముపోయినను ప్రాణములు దక్కినవిగదా యని సంత సించుచుఁ, జుట్టునుమూఁగి యర్భకులార్భాటములు సలుపఁ, గుక్కలితఁడెచ్చటనో కన్నమువైచి పరువిడుచున్న కన్నగాఁడని తలఁచి మొఱుఁగుచు వెంటఁదవుల, నరివారాతని వికారవిలాస మునకుఁ బరిహాసింప నేదియులెక్కసేయక యింటిమొగంబై పరువెత్తి యతికష్టమున నొడలికాటుకఁ గడిగికొనియెను.

ఉదయముననే యుపకోశ యింట నెవ్వరికిఁ దెలుపక, ప్రాణస్నేహితురాలగు నొక చేడియతో నందభూపాలుని

యాస్థానమున కేఁగి, హిరణ్యగుప్తుఁడు తన భర్త న్యాసముంచిన ధనము నీయననుచున్నాఁడని మొఱపెట్టుకొనెను. నందుఁడు హిరణ్యగుప్తుని రావించి, విచారింప నాతఁడు తనయొద్ద ధనము లేదని బొంకెను. అంత నుపకోశ "మహాప్రభూ! నా భర్త వెడలునపుడు మాయిలువేల్పుల నొక బోషాణములో నిలిపెను. వారియెదుట నీతఁడొప్పుకొనినాఁడు. వలయునేని దానిని దెప్పించి తాము స్వయముగ విచారింపనచ్చు"ననెను. రాజాశ్చర్యమున మునింగి, భటులనంపి, బోషాణము దెప్పించెను. ఉపకోశ దాని దిక్కు మొగంబై, "యోయిలువేల్పులారా! రాత్రి హిరణ్యగుప్తుఁడు మీయెదుట నొప్పుకొనిన విషయమునకు సాక్ష్యమొసఁగుఁడు. ఒసఁగరేని మిమ్మిట్లే భస్మముచేసెదను. లేకున్న ధర్మప్రతిష్ఠాపకుఁడగు నీ ప్రభువు నెదుర మీ బండారము బయలువెట్టెద" నని బెదరింపఁగా నందమిత విచారసాగరమున మునిఁగి క్రోవగానక తపించుచున్న మువ్వురును "సత్యము. రాత్రి హిరణ్యగుప్తుఁడు తానీయవలసిన న్యాసధనమును ఒప్పుకొనినాఁడు" అని పలికిరి. రాజు నిజమారసి హిరణ్యగుప్తునిచే ధనమిప్పించి, యాతని దండించెను.

అంత భూపాలుఁడా సాధ్విని గాంచి, "తల్లీ! నీ పాతివ్రత్యమనుపమానము. నీ భర్తయుఁ గడునిష్ఠాగరిష్ఠుఁడు. అట్టి మీయిలువేల్పుల దర్శించి తరింప నామన ముబ్విళ్లూరుచున్నది. కాన నీ బోషాణమును దెఱచి యందలివారిని గానిపింపుమని వేఁడగా నామెయు జరిగిన యావద్వృత్తాంతమును వివరించి, పెట్టెయఁ దెఱపించి, యందలి మువ్వురను, బాపపురాసులో యన నొప్పువారిని వెలువరించెను. రాజును వారిని విచా

రించి, వారి సర్వస్వమును దోఁచుకొని, దేశభ్రష్టులను గావించి యుపకోశతో నిట్లనియె.

“సాధ్వీమణీ! నీవంటి తల్లులుండుటచేతనే ధర్మమింకను నడుగంటలేదు. నన్ననుగ్రహించి, నా సోదరభావమును స్వీకరింపుమని కోరుచున్నాను” అని యనేక బహుమానము లొసఁగి యామెను సంతోషపఱచి, సాగనంపెను. ఆమె యీ కార్యములకు వర్షోపవర్షులును, నా తల్లియు నానందమున మునిఁగిరి.

## ౫

నేను విద్యాసముపార్జనార్థమై, మదోద్దండవేదండ పుండరీక మండల మండితంబైన హిమవత్కాంతార ప్రదేశములఁ ద్రిమ్మరి, యొక్క పవిత్రస్థలంబున నిష్ఠాగరిష్ఠుండనై కైలాసవాసినిగూర్చి తపంబొనర్చితిని. ఆ మహాదేవుండును నా భక్తితాత్పర్యంబుల కచ్చెరువంది, సాక్షాత్కరించి, యభీష్టవరములు వేఁడుమనుడు, నేను భక్తివశంకరుఁడగు నా శంకరు నుతియించి, నా యపజయము నివేదించితిని. భగవంతుఁ డంత పాణిని కొసఁగిన వ్యాకరణమే నాకు నిచ్చి యంతర్ధానమాయెను. నేఁజేయునదిలేక దానింగొని ఈశ్వరదర్శనానంద కందళితహృదయుండనై వీటికరుదెంచితిని. అచట నాభార్య పాతివ్రత్య నిరూపణ కథను విని సంతసించి, గురువర్యులకు నా పాణినీయ వ్యాకరణమే యొసఁగితిని.

అంతఁ గొంతకాలమునకు వ్యాడీంద్రదత్తులు, తమ విద్యాభ్యాసము పూర్తికాఁగా గురుని సమీపించి, గురుదక్షిణ వేఁడుఁడనఁగా నాతఁడు మామువ్వురివలనఁ గోటిసువర్ణములు కోరెను.

ధనికులయ్యు వారంతవిత్తము సంపాదింపలేక, నవకోటి సువర్ణా ధీశ్వరుఁడగు నందమహీపాలుని వేఁడ నిశ్చయించి, నన్నును గొని పోయిరి. కొన్ని దినములకు మేము హస్తినాపురసమీప నంద కటకమును జేరితిమి. కాని యాపట్టణ మేమెడలఁ దిలకించినను సంతోషోత్సాహశూన్యమై, పాడుపడినట్లుండెను. పౌరులు విన్ననైనవదనములతోఁ దమ సర్వస్వము పోఁగొట్టుకొనినవారి వలెఁ దిరుగుచుండిరి. అట్టి దుఃఖసాగరమున మునిఁగిన పట్టణ మును దిలకించి, యందులకుఁ గారణమరయ, నందభూపాలుఁ డప్పుడే సర్వసామ్రాజ్యమునువీడి స్థిరముగా స్వర్గమును జేరు కొనినట్లు తెలిసినది. అంత మాయభాగ్యదేవతను నిందించుచు నొక సత్రమునందు విశ్రమించి తరువాతి కార్యక్రమమును విచారింప మొదలిడితిమి.

కొంతవఱకు యోచించిన పిదప వ్యాడి యిట్లనియె. "మిత్రులారా! మన యదృష్టమీలాగున తెల్లవాఱినది. ఈ నందమహీపాలుఁడు దక్క నన్యులు మనకోరిక నెఱవేర్పఁజాలరు. మన దురదృష్టవశమున నాతఁడీలోక మిప్పుడే వీడినాఁడు. కావున నాయోచన వినుఁడు. మీకది సమ్మతమేని చేయుదము. యోగవిద్యా ప్రభావుఁడగు నింద్రదత్తుఁడు యోగమార్గమున నిప్పుడే నందరాజదేహమునఁ బ్రవేశింపవలసినది. నేనాతని దేహమును గాచియుందు" నని నన్నుఁజూచి, "నీవు వెంటనే యాతనిని సమీపించి కోటిసువర్ణము లర్థింపవలసినది. మన కోరిక యీడేఱినతరువాత నింద్రదత్తుఁడు తనదేహమును బ్రవేశింపవలసినది".

అట్లాతఁడు కార్యముపదేశింప మేమారీతి చేయ నిశ్చ యించి యుపక్రమించితిమి.

ప్రభువు మరణముచే విచారించుచున్న ప్రజలు మరల నింద్రదత్తుని యోగమార్గమున పునరుజ్జీవితుఁడైన నాతనిఁ గాంచి యానంద డోలికల నూఁగిరి. ఉత్సవముల జరిపిరి. నందుఁ డిట్లు మరణించి బ్రదుకుటనుగూర్చి మంత్రియగు శకటాలుఁడు సందేహించుచుండ నేనేఁగి కోటిసువర్ణము లర్థించితిని. ప్రభుఁడు వెంటనే నాకొసఁగ మంత్రి కాజ్ఞాపించెను. ఈ కృత్యముచే శకటాలుని సందియము స్థిరపడి యెల్లయెడలఁగల శవముల వెంటనే దహింపఁ బరిజనంబుల కాజ్ఞలిడెను. యోగనందుఁడు నా కోర్కె నెఱవేర్పఁ దొందరపెట్టుచుండెను. కాని శకటాలుఁ డిదోయదో యని జాగుసేయుచుండెను. ఇంతలో వ్యాడి యచ్చటికి నచ్చి, యోగనందునిఁగాంచి "మహాప్రభూ! తమ ధర్మపరిపాలనమున యోగనిష్ఠుఁడైన యొక బ్రాహ్మణ దేహమును నీ పరిచారకులు శవమను భ్రమచేఁ దగులఁబెట్టుచున్నారు. రక్షింపుఁ" డని మొఱపెట్టెను. ఆ మాటలతో నింద్రదత్తుని మొగము వెలవెలఁబోయెను. శకటాలుఁడు నిజమెఱిఁగెను. నా కీయవలసిన కోటిసువర్ణము లొసఁగి యంపెను. ఇంద్రదత్తుఁడు చేయునదిలేక నందశరీరమున స్థిరముగా నుండవలసినవాఁడాయెను.

పిమ్మట నొకనాఁడు నేనును వ్యాడియు నంద దేహములో నున్న నింద్రదత్తుని సమీపింపఁగా నాతఁడు "మిత్రులారా! మన మొకటి తలంచిన దేవుఁడొకటి తలఁచెను. నాకీ సిరి యేల? సర్వవిద్యాపారంగతుఁడనై యోగ మభ్యసించి, కడ కంతఃపురమున జవరాండ్ర నడుమ నైహికములగు తుచ్ఛసుఖముల ననుభవింప విధి నానుదుట లిఖించెఁగదా! స్వేచ్ఛగా దేశదేశములు భ్రమించుచు, విద్యాపాటవముచేఁ బండితుల

జయించుచు యశము నార్జించు నవకాశము లేకపోయెనే? అక్కటా, కట్టిడి దైవము నన్నెట్టి యిక్కట్టులనొంద నియమించెను." అని విచారించుచుండఁగా వ్యాడి "యో యింద్రదత్తా! ప్రాప్తించినది పోఁగొట్టుకొనవలదు. ఇందుమాత్రము కీర్తి సంపాదించు కార్యములు చేయు నవకాశములు లేవా? రాజ్య సంపదలచే గర్వింపక, దేవబ్రాహ్మణ పండితుల గౌరవించుచు, నీ యుద్యోగుల నానావిధములగు పారితోషికముల నాదరించుచు, ధర్మమును వదలక, ప్రజాసౌకర్యముల గమనించుచుఁ, బాలింపుము. నీకెట్టి తక్కువయు రాదు. మఱియు నిన్ను శకటాలుఁడు గుర్తించినాఁడు. ఎప్పుడైనను నీకుఁ గీడు కలిగింపక మానఁడు. కావున హితుఁడగు వరరుచిని మంత్రిగాఁ గొను"మని నుడివెను. అందుల కాతఁ డొప్పుకొని నాకుఁ బ్రధానిపదవి నొసఁగెను. "శకటాలుఁడు బ్రతికియున్న బ్రాహ్మణుని గాల్పించె"నని నేర మారోపించి, యాతని నూర్వురు కుమారులతో నేల మాలెలోఁ ద్రోయించి, దినమున కొక్క మూఁకుడు పిండి మాత్రమే వారి కాహారముగ నొసఁగుచుండెను. శకటాలుఁడు బందీయయి దుఃఖించుచు, కుమారులను జూచి, "వత్సలులారా! చూచితిరా యీ నందుని దుర్మార్గము? మనకిందఱి కిచ్చు పిండి యొకని కైనను జాలదు. ఇందఱ మెట్లు బ్రతుకగలము? ఈ నందునిపైఁ బగసాధింపఁగల వాఁడెవ్వఁడో యాతఁడే దీనిని స్వీకరించి బ్రతికియుండఁదగినవాఁడు. ఎవఁడట్టి కార్యమునకు సాహసించునో తెలుపుఁ" డన నందఱు "నయ్యా! నీకంటె నీకార్యమునకు నేర్పరి వేఱొకఁడు కలఁడా? ధైర్యసాహసోపేతుఁడవైన నీవే పగసాధించుటకుఁ

దగినవాఁడవు. కావున నీ యాహారమును గొనుమని నుడివి యతని యెదుటనే వారందఱు ప్రాణములఁ బాసిరి.

యోగనందునికి రాజ్యము స్థిరమాయెను. నేను మంత్రి నైతిని. సర్వభోగముల ననుభవించుట కాతఁడు నందకులము నుండి సర్వసేనాసమేతుఁడయి పాటలీపుత్రమునకుఁ బయన మాయెను. నేను వెంబడించితిని. వ్యాడియు ధనమును గొనిపోయి గురుదక్షిణ సమర్పించి, మఱలివచ్చి, తపమాచరింప వింధ్యాద్రి కరుగుటకు మా వీడ్కోలు కోరెను. యోగనందుఁ డాతని యెడఁబాటు సైఁపఁజాలక యిట్లు పలికెను. "సోదరా! మన కుటుంబములు వేఱయ్యును, దరతరములనుండి మిత్రుల మగుట నేక కుటుంబముగనే తలంచుచుంటిమి. మన తండ్రు లిర్వురు నెడఁబాటు నోర్వలేక తోడుతోడన మరణించిరి. మన మిరువురము చిన్ననాఁటినుండియు నొకటిగ నాహార విహార ముల జరుపుచు నేకశయ్యాగతులమై కాలము గడపితిమి. విద్యాభ్యాసమునకు నొకటిగా బయలు వెడలితిమి. నేఁటివఱకు మనము వేఱుపడినది లేదు. నీ కిప్పుడేల నన్ను వీడిపోవ బుద్ధి పుట్టినది? నేననుభవించు నీ రాజ్యసంపదలు నీవికావా? మిత్రుఁడా! వలదు. నన్ను విడువవలదు. మనము ముప్వుర మెప్పటివలె సుఖసంతోషములతోఁ గాలము పుత్తము. ఏల నిరర్థకమగు యత్నము చేసెద" వని యనేకవిధములఁ బలికెను. కాని వ్యాడి సమ్మతింపక "మిత్రుఁడా! ఏటిమాటలు? పుట్టినది బ్రాహ్మణకులమున. అభ్యసించినవి వేదవేదాంగ ములు. అట్టి నాకీ యిహలోక సౌఖ్యములేల? దైవవశమున నీ కవి ప్రాప్తించినవి. అనుభవింపుము. నీ కే కష్టము రాకుండఁ జూచుకొనుట కీ వరరుచి యున్నాఁడు. నన్ను

వదలు" మని పలికి మా వీడ్కోలు నంది యథేచ్ఛం జనియెను.

౬

యోగనందుఁడు రాజ్యము సంప్రాప్తింపఁగనే సర్వమును మఱచి భోగలాలసుండై యంతఃపురమును వీడివచ్చుటయే యరుదాయెను. రాజకార్యములన్నియు నా భుజస్కంధములపైఁ బడెను. మంత్రిసమావేశము, న్యాయాన్యాయ విచారణము, పౌరజన విజ్ఞాపన శ్రవణము, ప్రజా సౌకర్య కార్యాచరణము, గూఢచారి నివేదితాంశ పర్యాలోచనము మొదలగు కార్యకలాపములతో నా నిత్య నైమిత్తిక కార్యముల కంతరాయము కలుగుచుండెను. కావున నాకు సహాయకుఁ డొకఁడు గావలసియుండెను. నయవిశారదుండగు శకటాలుఁ డిందులకుఁ దగినవాఁడని చక్కఁగా నాలోచించి, ప్రభు ననుమతి పడయుటకై యొక్కనాఁడు రహస్యముగా నాతని సమీపించి "ప్రభూ! తామంతఃపురమును వీడిరాకుంటిరి. రాజ్యాంగ కార్యములలో నాకూపిరి యాడుటలేదు. నా వైదిక కార్యముల కాటంకము కలుగుచున్నది. నాకు సహాయకుఁ డొక్కఁ డావశ్యకమైయున్నాఁడు. కాన శకటాలుని నిర్బంధమునుండి తొలఁగించి సహాయ మంత్రిగా నియమించికొందు" మనఁగాఁ బ్రభుఁడు "వరరుచీ! శకటాలుని సంగతి యెఱిఁగియుండియు వానిని విడుదల చేయించుట యెట్లు? నా వినాశనమును జేతులారఁ దెచ్చుకొనినట్లుకదా" యన, నేనును "రాజా! నేనున్నంత వఱకుఁ దమకాతఁ డెట్టి యపకారమును జేయఁజాలఁడు. మఱియు నాతని పుత్రులందఱు మడిసి నిస్సహాయుఁడై యున్నాఁడు. మీరు నిశ్చింతతోనుండుఁ" డన నాతఁడు సమ్మ

తించెను. అంత నేను శకటాలుని విడిపించి, నాకు సహాయ కునిఁగా నియమించికొంటిని. అతఁడును గృతజ్ఞతా బద్ధుఁడయి యెల్లవేళల నాకనుకూలుఁడుగాఁ బ్రవర్తించుచుండెను.

యోగనంద శకటాల సమేతుండనై నే నొకనాఁడు గంగా నది యొడ్డున విహారము సలుపుచుండగా నైదు వ్రేళ్లొకటిఁగాఁ జేర్పఁబడిన చేయి యొకటి నందుఁడు ప్రవాహ మధ్యమునఁ గాంచెను. దాని యర్థ మెఱుఁగఁజాలక నన్నుఁ బిలిచి కాన్పించెను. నేను రెండు వ్రేళ్లొకటిగాఁ జేర్చి చూపఁగా నా హస్తము మాయమయ్యెను. ఈ వింత కందఱాశ్చర్య మానసులై దాని యర్థము వివరింపవలయునని నన్ను వేఁడిరి. అంత నేను "ఈ లోకమున నైదుగు రేకమత్యమున నున్న నెంత కార్యమైనను సాధింపవచ్చు" నని యా చేయి సూచించి నది. అందుల "కైదుగురు కాదు, ఇరువు రేకమైయున్న నెంత కార్యమైనను సాధింపవచ్చు" నని బదులు చెప్పితిని. అది మాయమయ్యెను. అంత వారు నాయనుపమానమగు నెఱుకకు సంతసించిరి. నాయండ నున్నంతవఱ కేకీడు కలుగ దని నందుఁడును, నే నున్నంతవఱకు నందునికిఁ గీడు దలఁచు టకు వీలుకాదని శకటాలుఁడును దలంచిరి. అప్పటినుండియు నందుఁడు మునుపటికంటె నాయం దెక్కుడు విశ్వాసముంచి మెలఁగుచుండెను.

ఇట్లుండ నొకనాఁడొక విప్రుఁడు—నైష్ఠికుఁడు పాటలీ పుత్ర వీధులలోఁ బోవుచు యోగనందుని యంతఃపురమును సమీపించెను. అతని భావమెట్టిదో కాని సౌధముమీఁది జాలకములవంకఁ దిలకించెను. అచ్చట మెఱపుఁదీవవలెఁ, బూర్ణచంద్రుని దిరస్కరించు నెమ్మొగముతో యోగనందుని

భార్య యీ నిర్భాగ్యుఁడగు బ్రాహ్మణుని జూచుచుండెను. దీనిని గాంచుచుండిన నందుఁడు వెంటనే తలవరులకు, బ్రాహ్మణుఁ డెంత మొఱపెట్టుకొనుచున్నను వినక, యప్పగించి, వధింప నాజ్ఞాపించెను. హంతకులు ఆతనిని కొనిపోవుచుండఁగా పట్టణ వీధులలోని మీన విక్రయశాలయందలి యొక శుష్క-మీనము చూచి నవ్వెను. ఈ విషయమును దలవరులు రాజున కెఱిఁగింపఁగా నాతఁడా బ్రాహ్మణుని వధించుట యా నాఁటికి నిలిపి, నన్నుఁ బిలిపించి, శుష్క-మీన హాసమునకుఁ గారణమడిగెను. నేను మఱునాఁడు వినిపింతునని యింటికి వచ్చి, నా యిష్ట దైవమగు భారతిని ప్రార్థింపఁగా నామె ప్రత్యక్షమై "పుత్రా! ఈ నిశీధిని నేరికిఁ దెలియక యొంటరిగా శ్మశాన వాటికలోని దీర్ఘ తాళ వృక్షముపై నధివసించి యుండుము. నీకా చేప నవ్వునకుఁ గారణము తెలియునని యాదేశించెను.

ఆ రాత్రి యెవ్వరికిని దెలుపక. ధైర్య సహాయుఁడనై వల్లకాటి కరిగితిని. అదియుఁ గొఱవి దయ్యములవలె మండుచున్న చితుల ప్రక్క-న దట్టమైన చీఁకటులఁ గ్రమ్ముచుండు మహావృక్షములతోడఁ గడు భయంకరమై కానిపించెను. దేవి చెప్పినట్లున్నత మగు తాటిచెట్టు నెక్కి- యేమి జరుగునో యని వేచియుంటిని. సగము రాత్రి దాటఁగనే యచ్చటికిఁ బొట్టి ముక్కు-ను, కుఱుచ చేతులును, బాన కడుపును, చిన్న కన్నులును, లావు తొడలును, గానుగ మ్రానువంటి కాళ్లును, మెలికలు తిరిగిన వాఁడి కోఱలును గల యొకరక్క-సి, రూపమునఁ దల్లిని పోలిన తన సంతానముతో నచ్చటికి వచ్చెను. ఆ పుత్రులలో నొకఁడు "అమ్మా! నా కాఁకలి యగుచున్నది.

తినుట కేమైన పెట్టు”మని వేధింపఁజొచ్చెను. అంత నారక్కసి వానిని చూచి “ఓయీ! నేఁడూరకుండుఁడు. జేపు తృప్తిగ బ్రాహ్మణ మాంసమును మీకుఁ బెట్టెదను. ఆ బ్రాహ్మణుని నేఁడే యురి తీయవలసినది. కాని వానిని జూచి యొక యెండు చేఁప నవ్వుటచే, రాజందులకుఁ గారణ మరయఁగోరి, జేపటి వఱ కా యాజ్ఞను నిలిపియుంచినాఁడు. కావున జేపటికిఁ బుష్కలముగా లభింపఁగలదు” అనఁగా నాబాలుఁ “డమ్మా! ఎండుచేఁప యేల నవ్వెన” దని యడుగ నది యిట్లనియె “బాలకా! అది పరమ రహస్యము. ఎవ్వరికిని తెలియరాదు. ఈ రాజాంతఃపురమునఁ బెక్కుఱు పురుషులు స్త్రీవేషములఁ దాల్చి సంచరించుచున్నారు. అది తెలియక యీ రాజ మాయకుఁడగు నొక బ్రాహ్మణునిఁ జంపించుచున్నాఁడు. ఈ వింత కామీనము నవ్వెన” దని చెప్పుచుఁ దన సంతానమును గొని యథేచ్ఛగాఁ జనియెను.

నేను వృక్షమునుండి దిగి, యింటికి వెడలి యా రాత్రి గడపి, యుదయముననే కాల్యకరణీయములు నిర్వర్తించి, రాజుకొలువునకుఁ బోయి యీ వృత్తాంత మెఱిఁగించితిని. అతఁడు స్త్రీ వేషులగు పురుషుల నెల్లరఁబట్టి నిర్దయుఁడై వధించెను. ఈ కార్యముచేతఁగూడ నాయందు రాజునకుఁ గొంత గౌరవము హెచ్చినది. కాని యయ్యదియే నాపై నాతని కనుమానము కలుగుటకుఁ గారణమైనది. ఎట్లన, నొకానొక చిత్రకారుఁడు, మిక్కిలి నేర్పరియగువాఁడు, రాజ దర్శనమున కేఁగుదెంచి, యాతనిచే సన్మానితుఁడయి, దేవీ రూప పటమును జిత్రించి యొసఁగెను. అదియు జీవకళ లుట్టిపడుచు దేవియే పటమున నిలిచియున్నదేమో యను భ్రాంతిని

గూర్చుచుండెను. దానిని జూచి రాజు మిక్కిలి సంతసించి, యనేక పసదనంబులఁ జిత్రకారుని దృప్తిపఱచి, యంపి, యా చిత్రపటమును రాణి పడకటింటఁ గట్టించెను.

రాజు నంతిపురమున, నే యాటంకములేక యేప్రదేశమున నైన నిరాఘాటముగా నాకుఁ బ్రవేశముండుటచే, నొక నాఁడు రాణి పడకటింటికేఁగి యందుండు చిత్రమును జూచుట తటస్థించెను. ఆ చిత్రము సర్వలక్షణ లక్షితమై, సర్వాంగ సుందరమై యలరారుచుండెను. కాని మొలత్రాటి చెంత నుండఁదగు నొక పుట్టుమచ్చ యుండకపోవుటచే రాణింప దయ్యెను. నేనది గమనించి, వెంటనే జఘన ప్రదేశమునఁ గస్తూరి తూలికతో నంకము రచించి మఱలితిని. ఆ యంకముచే నది మునుపటికంటె భాసమానమై యుండెను. పిమ్మట రాజు దానిని జూచి, యట్లు మునుపటికన్న విచిత్రకాంతితో మెఱయుటకుఁ గారణము తెలిసికొని తనలో నిట్లు చింతించెను: “అక్కటా! ప్రభాసంపన్నుఁడని, నాసబ్రహ్మచారియని, నాకనుకూలుఁడగు మిత్రుఁడని యీ కాత్యాయనుని నా మంత్రిగా వ్యాడి యుపదేశమున నియమించితిని. అట్టివాఁ డిప్పు డెట్టి ద్రోహము దలపెట్టినాఁడు. ఇతనికంటె శకటాలుఁడే మేలు కదా! ఎప్పుడో యొకనాఁడు నా ప్రాణముల కెసరు పెట్టును. కాని యిట్టి విశ్వాస విఘాత మొనరింపఁడు కదా! ఇతఁడేకదా నాయంతఃపురమున స్త్రీ వేషులగు పురుషులున్నారని తెలియఁజేసినాఁడు. వారిలో నీతఁడు చేరకున్న నీకు నెట్లు తెలియును? ఈ దురాత్ముని నెచ్చెలి యనుకొనవచ్చునా? నా హృదయమునఁ జిచ్చువెట్టిన యీతని జంపించిన పాపమేమి? బ్రాహ్మణుఁడైన నగుఁగాక! కృతఘ్నుఁడు తప్పక వధార్హుఁడే”

యని, శకటాలుని రావించి, వెంటనే నన్నుఁజంప నాజ్ఞా పించెను.

శకటాలుని నేనొకపరి కాపాడితిని కదా! అతఁడా కృతజ్ఞతతోఁ దన మనమున ననేక ప్రకారములఁ జింతించి, నా ప్రతిభా విశేషములఁ దలఁచి, నన్ను వధించుట తన కసాధ్య మని యెంచి, తేనితోఁ జంపుదునని యొప్పుకొనినవాఁడు నా చెంత కరుదెంచి, యున్న విషయమంతయుఁ దెలిపి "యమాత్య వర్యా! నన్నుఁ గృతఘ్నునిగాఁ దలంపవలదు. నిన్నొక నేల మాళిగలోనుంచి, సమస్త సదుపాయముల నొసఁగి కాపాడెదను. దేవుని కృపచే నెన్నటికేనిఁ గామాంధుఁడగు నీ నందునికిఁ గనువిప్పు కలుగకపోదు. అప్పుడు మీయిచ్చవచ్చినట్లు చేయ వచ్చు" నని పలికెను.

అందులకు నే నిట్లంటిని: "అయ్యా! శకటాలా! నీ న్యాయ బుద్ధి నిన్నిట్లు ప్రేరేపించుచున్నది. నన్నుఁ జంపుట, నీకుఁగాని, యీ నందునికిఁగాని మఱియెవ్వరికిఁగాని సాధ్యముకానిది. నాకు రాక్షసుఁ డొకఁడు స్నేహితుఁడున్నాఁడు. నే నెప్పుడు మనమునఁ దలఁతునో యప్పుడు ప్రత్యక్షమై నా కార్యముల నొనరించిపోవును. అతని కసాధ్యమైనది లేదు. ఈ లోకము నంతయు నిమిసములోపల మ్రింగివేయఁగలఁడు. కాని యీ రాజు, నాసఖుఁ డింద్రదత్తుఁడనువాఁడను సంగతి నీవును గ్రహించియేయున్నావు. కావున వానికిఁ గీడుసేయుటకు నామన మిచ్చగింపదు! అని వచించితిని. తరువాత నన్నాతఁడు నేలమాళిగలో నుంచి పోషించుచుండెను.

## ౭

నా ప్రభావము ప్రత్యక్షముగా నెఱిఁగినవాఁడయ్యును శకటాలుఁడు రాత్రించరుని విషయమును దెలుపఁగనే, వానిని చూచుటకును, నాకెట్లాతనితో మైత్రి కలిగినదో యెఱుఁగుటకును గుతూహలపడెను. నే నాతని కోర్కె నెఱవేర్చుటకు సంతసించి, యాత్మలోఁ దలంచినంత మాత్రానఁ దాళవృక్ష ప్రమాణము వాఁడగు నిశాచరుఁడు గోచరుఁడాయెను. శకటాలుఁడాతనిఁ జూచి భయవిస్మయములనంది, యాతని యంతర్ధానము కోరెను. నేనా యసురుని పోవంబనిచి, శకటాలున కిట్లంటిని. "ఓయీ! కాంచితివి కదా! ఈతఁడే నా మిత్రుఁడగు రాక్షసుఁడు. నేఁ గోరినంత మాత్రమునఁ బ్రత్యక్షమగుచుండును. ఈతని జయింప నేరికి తరమగును? నీవు నందునిచే బందీవై యంధకూపమున మ్రగ్గుచుండఁగాఁ బట్టణమున రాత్రులందుఁ బ్రజల సంచారము కష్టమయ్యెను. మాటుమణఁగిన వెనుక పురవీధులలో ద్రిమ్మరువాఁడు సులభముగా యమపట్టణమునకుఁ గాపురము వెడలవచ్చును. ఇట్లెందు కగుచున్నదో యెవ్వరెఱుఁగరు. పట్టణమున భీతి యావహిల్లినది. నందుఁ డీసంగతి నెఱిఁగి యొక కొత్వాలు నీ హత్యా విషయమును దెలిసికొనుటకు నియమించెను. కాని మఱునాఁటి కాతఁడు మరణించియుండెను. ఇట్లెందఱీ రహస్యమును భేదింపదలఁచినను మరణము వాఁడి కోఱలకుఁ జిక్కి నశించుచుండిరి. కాని నేను తెగింపుచేసి నందునితోఁ బలికి నాఁటి రాత్రి పట్టణములోఁ దిరుగఁదలఁచి యేఁగుచుంటిని. ఎచ్చటను శబ్దములు లేవు. అచ్చటచ్చట గుడ్లగూబల శబ్దములును, నక్కల కూఁతలును, కుక్కల మొఱుఁగులును

డప్పు నన్న్యము వినవచ్చుటలేదు. మానికములు తాపఁబడిన నీల్గపు మేలుకట్టునలె నాకసము విలసిల్లుచుండెను. కాటుకలో మునిఁగినట్లు చీఁకటిలోఁ గలిసి పోవుచుండ నా చేయి నెవరో పట్టుకొని వెనుకకు లాగినట్లయినది. నా శక్తినంతయు వినియోగించి యా యినుపచేతి పట్టునుండి విడిపించుకొనఁ బ్రయత్నించితిని. కాని భీకరాకారుఁడగు నొక పురుషుఁడు వికటాట్టహాస మొనరించి, నా యెదుట నిలువఁబడి, "మంత్రి వర్యా! నానుండి విడుదల పొందుటకు నీ శక్తి చాలదు. ఈ పట్టణమున నిందఱి మరణమునకుఁ గారణభూతుఁడనగు నే నొక రక్కసుఁడను. నేనడుగు ప్రశ్నమునకు సదుత్తర మిచ్చినచో నీకు మరణము దప్పును. లేకున్న నీ మిత్రులను గలిసి కొందు" వనెను. అంత నే నా ప్రశ్న నడుగుమనఁగా వాఁడు "ఓయీ! ఈ పట్టణమున నందఱ కర్త యెవ" రని ప్రశ్నించెను. నేను పకపక నవ్వి, "మూఢుఁడా! ఇది తెలియదా? ఎవరికంటె కెన తెయింపయి యుండునో యది వానికి ప్రపంచమున నందఱ కర్త" యని ప్రత్యుత్తర మిచ్చితిని. వాఁడు సంతసించి, "మహానుభావా! నీ వశేష శేముషీధురీణుఁడవు. నీచే నోటుపడితిని. నేఁటి నుండి నీకు మిత్రుండనై నీ యాజ్ఞాపించు కార్యములనొనరించుచుండెద" నని యంతర్ధానమాయెను. నేనింటికి మఱలితిని.

ఇట్టి విస్రంభ సంభాషణములతో నేలమాలెలో శకటాలుఁడు నాకు సర్వసౌకర్యములు సమకూర్చుచుండ, నాతనితోఁ బ్రొద్దుపుచ్చుచుంటిని. ఇట్లు మా యిరువురికిని మునుపటి కంటె స్నేహ మెక్కుడాయెను.

ఒకనాఁడు విచారమగ్నుఁడనైయున్న నన్నుఁ జూచి శకటాలుఁడు "మహాశయా! సర్వమెఱిఁగిన మీరీరీతి వంతల

పాలయి యుండవచ్చునా? దైవనిర్ణయము ననుసరించి మన కృత్యముల ఫలాఫలములు అనుభవమునకు వచ్చునను సంగతి మీరెఱుఁగనిది కాదుగదా! విచారమువలన నేకార్యమగును? ఇది పరీక్షా సమయమని తలంపుఁడు. మీకుఁ దెలుపునంతటి వాఁడను గాను. ఈ నందునికి మిముఁబోటి ప్రతిభావంతుల యక్కఱ రాకమానదు. అంతవఱకోపికపట్టి యుండుఁడు." అని యనేక ప్రకారముల నోదార్చి, "మహానుభావా! మీ మహిమములనంతములు. గంగాభవాని మీయందుఁ గడు కరుణార్ద్రచిత్తయని విందును. ఆ మహాదేవిని గాంచ మన ముచ్చిళ్లు లూఱుచున్నది. మీయార్తి యడఁగుటకును, నా యభీష్టము నెఱవేఱుటకును నమ్మాత దర్శనభాగ్యము దయ చేయింప వేఁడుచున్నా" నని ప్రార్థింప నే నామాత నిట్లని స్తోత్రముచేసితి.

"జయ జయ గీర్వాణాంగనాకుచకుంభ సంకలిత కుంకుమ పరాగసంవాసిత ప్రవాహా! మదనదగ్ధీకృతాంగార ఫాలనేత్ర జటిలజటాజూటాలంకార! మహాబలి నిర్బంధన చాతుర్యత్రివిక్రమవ్యోమతల మానాయమానద్వితీయపాదోద్భవ! సకల కల్మషవిదూర! నిత్యపాండురశరీర! సకల జలజంతు విహార ప్రదేశ! అగణితమణినికరనిలయూర్ధ్వాంగ సమాక్రామిత ప్రేమ ప్రపూరితాంతరంగి! సారీకృతార్యావర్తప్రదేశ! త్రిలోక పరిపూత! జగన్మాత! నమస్తే! నమస్తే! నమస్తే! నమః."

ఈ నా స్తోత్రమునకలరి యా జగదంబ దివ్యమానుష రూపమునఁ బ్రత్యక్షముకాఁగా నా మిత్రుఁడు సంతసించి, యామె ననేకవిధములఁ బొగడె. మా యిరువురి స్తోత్రముల

కలరి గంగాభవాని యంతర్హితయయ్యె. నాఁటినుండియు శకటాలుఁడు నాయం దధికాదరాభిమానములనుంచి నాబహిః ప్రాణమై యనేక విధముల నాకు సౌకర్యములఁ గలిగించుచు, నా విచారములఁ బోఁగొట్టుచు కాపాడుచుండెను.

౨

హిరణ్యగుప్తుఁడు యోగనందుని కుమారుఁడు. అంతటి దుశ్శీలుఁడింకొకఁడు కానరాఁడు. పెద్దలయెడ వినయ విధేయతాది సుగుణములెట్టివో వాఁడెఱుఁగఁడు. అల్పవిద్యాయుతుఁడగు నాతఁడహంకారియై యెవ్వరిని లక్ష్యపెట్టక తిరుగుచుండును. సద్గుణముల బోధించువారిని చావమోదును. దుర్మార్గములఁ దెలుపువారిని సన్మానించును. అట్టి యాతఁడొకనాఁడు వేఁటకై సమీపారణ్యములకు బయలుదేరెను. వేఁటకుక్కలు, బోయలు, వలలు, నురులుఁ గైకొని పయనమగుచుండ నాతని కనేకదుశ్శకునము లెదురయ్యెను. శకునవేత్తలైన మహనీయు లవి యాపదలకు మూలములని తెలిపినను, హితులెంతవలదని వారించినను, భృత్యులెంత వినయముతో విన్నవించుకొనినను, బట్టిన పట్టు వీడక యా మూర్ఖుఁడు దైవప్రేరితుఁడై కాననముల కేఁగెను.

అట నాతఁడెంత వెదకినను వేఁటకుఁ దగిన ఏనుఁగులు మొదలగు క్రూరమృగములుగాని, జింకలు, కుందేళ్లు మొదలగు సాత్త్విక మృగములుగాని కానరాలేదు. అడవియంతయుఁ దిరిగి తిరిగి, విసివి వేసారి యలసి, యటు నిటు మలయుచుండ, రాకుమారున కొక సూకర మగపడెను. అదియుఁ దొండములేని యేనుంగువలె మదమున వచ్చుచుండ హిరణ్యగుప్తుఁడు

దానిపై బాణము ప్రయోగించెను. కాని యది తప్పించుకొని, పోవుట గమనించి, యాతఁడు వెంబడించెను. సూకరమును, దాని వెనుక రాకొమరుఁడును బందెములు వైచుకొనిరో యనునట్లు పరువిడుచుండ సైనికులు సమీపింపలేరైరి. సాయంకాలమాయెను. మార్తాండుఁ డపరదిశాసతీమణి కౌఁగిట నణఁగెను. చుక్కలాకసమున భాసించెను. చీఁకట్లు క్రమ్ముచుండెను. రాజకుమారుఁడు పందిమీఁది యాసవీడి యాత్మప్రాణత్రాణపరాయణుఁడై యొక మఱ్ఱిక్రింద గుఱ్ఱమును గట్టి, సమీపమునందలి పద్మాకరమున తీయని నీరు తృప్తిగాఁ ద్రావి, యా రాత్రి గడపుటకయి యా వటమహీరుహము నారోహించెను.

అంతట నొక బెబ్బులి భయంకరముగా బొబ్బలిడుచుఁ దఱుముకొనిరాఁగా భయపడిన యొక భల్లూకము ఆ చెట్టునే యెక్కెను. ఆ పులియు వదలక యెట్లైనను దీనిని చంపుదునని ప్రతిజ్ఞ పట్టినదియో యన, నా వృక్షమూలమునఁ దిరుగుచు సమయము నిరీక్షించుచుండెను.

పాదపము మీఁదనున్న హిరణ్యగుప్తుఁడు భల్లూకము రాకకు భయపడి, వెలవెలఁ బోవుచుండ నా యెలుఁగాతని సమీపించి, మానుషభాషల "నో రాజకుమారా! నీవెట్లు నావలన భయమందుచుంటివో యట్లు నేనీ శార్దూలమువలన భయము చెందుచున్నదానను. మన మిరువురము సమాన స్థితియందున్నవారము. కాన స్నేహితులమైతిమి. నావలన భయపడకుము. నేను నీకెట్టి హానియుఁ జేయను. నిశ్చింతతో నుండు" మని యాతని వెఱపుడిపి, సమీపించి, నిద్రమత్తుచేఁ దూఁగాడుచున్నవానిని చూచి, "అయ్యా నీవేల తూఁగాడె

దవు? నాయంకమునఁ దలనిడి సుఖముగా నిదురింపుము" అని హెచ్చరించెను. వాఁడును మనమున భీతిఁజెందియు చేయునదిలేక యెలుఁగు నోడిలో తల నిడి విశ్రమింప నది యాతని నిద్రపుచ్చెను.

ఆశాపాశముచే బంధింపఁబడి చెట్టుదగ్గఱనే తిరుగుచున్న యా పెద్దపులి యెలుఁగుబంటిని జూచి, యిట్లనెను. "ఓయి మిత్రుఁడా! నీవెట్లును దప్పించుకొంటివి. అరణ్యవాస కారణమున మనమిరువురము మిత్రులము. నీవు తొడపైఁ బండించుకొనిన యీ రాజకుమారుఁడు మనలను వధించుటకే వచ్చిన నిర్దయాత్మకుఁడు. అట్టివానిని సుఖముగా నిద్రపుచ్చుచున్నావు. అది నీకు తగునా? శత్రువును సంరక్షించిన మరల హాని గావింపక యూరకుండునా? చేఁజిక్కినంతనే చీల్చి గర్భగోళము నింపకున్న మరల మరల మన కపకారములు గావించుచుండును. మానవు లసత్యములు పలుకువారు. అందును రాచబిడ్డలసంగతి చెప్పవలయునా? కావున నీతని క్రిందికిఁ బడఁద్రోయుము. క్షుధాబాధితులమైన మన యిరువురికిని బుష్కలముగా నాహారము కాఁగలఁడు. వేఱు యోచన వలదు. సమయము జాఱవిడిచిన పిమ్మట విచారింప వలసివచ్చును. నా వాక్యములు వినుము. నేఁటినుండి మనము మిత్రులమై మెలఁగుదము" అని యనేకవిధముల బోధింపఁగా నా యెలుఁగుబంటి "ఓ శార్దూలమా! ఏల యీ యందని మ్రానిపండ్ల కట్టులు చాఁచెదవు? నీ కోరిక నెఱవేఱదు. అతఁడు నా శరణార్థి. భయాకులుండయి శరణని వచ్చినవాని నెట్టివానినేని కష్టపెట్టుట మహాపాపము. నీవన్యచింతలు

మాని యిటనుండి వెడలుము" అనెను. కాని యా పులి యందే యుండెను.

కొంత తడవునకు రాకొమరుఁడు మేల్కొనఁగానే భల్లూక మాతని గుణములను బరిశీలించుటకయి యాతనిఁ గని, "యో రాజకుమారా! నాకు నిద్రవచ్చుచున్నది. అలసట వెల్లుమీఱి దేహము వశముగాదు. నీ యంకస్థలమునఁ గొంచెము చోటిచ్చి, నన్ను నిద్రపోనీయవా?" యని ప్రార్థింప నాతఁడు సమ్మతించెను.

వ్యాఘ్ర మీ దృశ్యమును గాంచి, భల్లూకమును మోసగింపఁ దలఁచినట్లే నృపనందనుని మోసగింపనెంచి యిట్లనియె. "ఓయీ! మానవా? నీవెంతటి యమాయకుఁడవు? తీయని మాటలు పలికిన యీ ముదుసలి యెలుఁగు మాయలకుఁ జిక్కితివి. నే నిట నున్నంతవఱకు నీకే యాపదయుఁ గలుగదు. నేను కదలి వెడలగనే యీ యెలుఁగుబంటి నిన్ను గుటుక్కున మ్రింగఁజూచుచున్నది. ఈ యాపదఁ దొలఁగించుకొనఁ దలఁచితివేని, శీఘ్రముగా నా ముసలి యెలుఁగును గ్రిందికిఁ బడఁద్రోయుము. నేను చక్కఁగా భుజించి నీకాపద రాకుండునట్లుచేసి, నా దారిని బోయెదను. నీవు నీ యిచ్ఛ మెయి నరుగవచ్చును."

అనఁగానే యాతఁడించుక చింతించి, దుశ్శకునప్రభా

యెలుఁగును గ్రిందఁ బడఁద్రోసెను. అదియుఁ గపటనిద్ర నభినయించుచుండినది కాన, నియుదంతమును గ్రహించి, క్రిందఁ బడకుండ నొక శాఖను గట్టిగఁబట్టుకొని యుండెను. రాజపుత్రుఁడు తన దుశ్చర్యాఫలముగ నెలుఁగుచే మరణము

నిశ్చయమని యెంచి, భయముచే గడగడ వడకుచుండెను. అంత భల్లూక మాతనిని గాంచి, "యోయీ! భయపడ వల" దని యూఱడించెను.

కొంతవడికి సూర్యోదయమగు చిహ్నము లగపడెను. తూరుపు తెల్లవాఱెను. నక్షత్రములు మఱుగుపడఁ జొచ్చెను. వేఁటకై తిరుగు క్రూరమృగముల సంకులమడఁగెను. అదిగని పెద్దపులి యిఁక లాభము లేదని నిరాశ చేసికొని, తన మనికి పట్టునకు మరలిపోయెను. ముసలి యెలుఁగు రాజపుత్రునితోఁ గూడ చెట్టు దిగి, యాతనితో నిట్లనెను. "ఓయీ! కృతఘ్నుఁడా! మేలుగూర్చు మిత్రునకే యపకారముచేయు నీవంటి ద్రోహిని ప్రాణవిముక్తుని గావించినను దోషములేదు. అయినను, నీకుఁ దొలుత నిచ్చిన వాగ్దానము ప్రకారము ప్రాణహాని గావింపనొల్లను. కాని యరణ్య మధ్యమున సంభవించిన యీ విషయ గర్భితమగు "ససేమిరా" యను వాక్యమును బలుకుచుఁ దక్కిన పూర్వవృత్తాంతమంతయు మఱచి, యున్మాదివై పరిభ్రమించుచుండుము. ఎవ్వఁడేని మేధావియగు పండితుఁడిందలి యర్థము గ్రహించి లోకమున నీ విషయ మెఱిఁగించిన యప్పుడు, నీయపస్మారము తొలఁగు"నని శాపమోక్షముల నొసఁగి, యథేచ్ఛం జనియెను. రాజకుమారుం డాక్షణముననే శాపగ్రస్తుఁడై పూర్వవిషయముల నెల్ల మఱచి "ససేమిరా" యనుటదక్క నన్యంబు పలుకఁ జాలక యా యరణ్యమునఁ దిరుగుచుండెను.

హిరణ్యగుప్తుని యనుచరులాతని నాయరణ్యమున వెదకి వెదకి, విసివి యెందునుగానక యేమిచేయుటకునుదోఁపక యింటి

మొగంబై పాటలీపుత్రమును జేరిరి. అంతకుమున్నే బెబ్బులి బొబ్బకు భయపడి కళ్లెమును ద్రెంచుకొని పరువిడివచ్చిన హిరణ్యగుప్తు నశ్వమునుగాంచి పరిపరివిధముల విచారించుచున్నందున కీపిడుగుఁబోలిన వార్తను వినిపించిరి. ఆ రాజంత దుఃఖాగ్ని చేత దహింపఁబడుచున్న మనస్సుతో ననేక విధములఁ గుమారునిఁబేర్కొని విలపించి, కొంత యూఱడిల్లి భటుల రావించి, యెందున్నను గనిపెట్టి తీసికొనిరా నాజ్ఞాపించి, నలువైపులకుఁ బంపెను. వారు రాజాజ్ఞను శిరసావహించి, యరణ్యమున కేఁగి, కలయఁదిరిగి, ప్రతిగుహాయుఁ, బొదరిల్లును, చెట్టును, గుట్టను జక్కఁగాఁ బరిశీలించి యెక్కడనుగానక మరలువారొక వృక్షచ్ఛాయను వికృతాకారుఁడై యున్మత్తుఁడై "ససేమిరా" యనుటఁదక్క సర్వమునుమఱచి పిశాచమువోలెనున్న రాజకుమారునిఁగాంచి బలవంతముగఁ దమతోడఁ గొనిపోయిరి.

నందుఁడట్టి స్థితిలోనున్న కుమారునిఁగాంచి, దుఃఖితుఁడై యనేక మంత్రౌషధ చికిత్సలును, దేవభూదేవతృప్తులును జేయించి విఫలుఁడై యనేకవిధముల బాధనందుచుండెను.

యోగనందుఁ డనుభవించు విచారమును గుర్తించి శకటాలుఁ డొకనాఁడు నాయెడకరుదెంచి, హిరణ్యగుప్తుని వృత్తాంతమును వినిపించెను. అప్పుడు నేనాతనితో నిట్లంటిని. "మిత్రమా! శకటాలా! రాజకుమారుని యున్మాదమునకుఁ గారణము నాకుఁ దెలియును. మఱియు దాని నివారణోపాయమును నేనెఱుఁగుదును. కాని మనమయి రాజు నాశ్రయించుటకంటె, నీ విషయమున ముందుగ నాతఁడే ప్రస్తావనఁజేసిన బాగుగనుండును" అంటిని. శకటాలుఁడు నాతో నేకీభవించి, సమయము నిరీక్షించుచుండెను.

ఒకనాఁడు రాజేకాంతమునఁ దన కుమారునిగూర్చి చింతించుచుండ శకటాలుఁడు రాజకార్యావసరమై యనుమతిఁ బొంది లోనఁ బ్రవేశించి, చింతాసముద్రమున మునింగియున్న నందునిఁగాంచి, "రాజేంద్రా! మీముఖమేల వాడియున్నది? కుమారుని యున్మాదవ్యాధియే యిందులకుఁ గారణమా? ఎందఱు వైద్యులు చికిత్సచేయుటలేదు? ఎవరిచేయివాసిచేతనైన నేనాఁటికైన నిమ్మళింపవచ్చునుగదా! మీరు విచారించినమాత్రమునఁ గలుగు ప్రయోజనమేమి? ధైర్యశాలురగు మీరే యూఱడిల్లకున్న నిఁక నంతఃపురమందలి కాంతాజన మెట్లూఱడిల్లును? ఓపికవహింపుఁ"డని యుపశమనవాక్యములు పలుకరాజిట్లనియెను.

మంత్రివర్యా! నేనేమని యూఱటఁగొందును? ఎందఱు వైద్యులువచ్చి యెన్నిమందులు నూఱిపోసినను బూడిదలో చేసిన హోమమువలె, సముద్రమునఁగలిపిన చక్కెరవలె నిష్ప్రయోజనములగుచున్నవి కదా! పేరుప్రఖ్యాతులు గడించిన మంత్రవేత్తల మంత్రతంత్రముల నెట్టి యనుకూలమును గలుగ లేదే! కడకిది యిట్టి రోగమనియైన నెవ్వరును దెలుప లేదే! ఏమి చేయుదును? వాఁడేగుటకుముం దారోగ్యయుతుఁడై యుండెనుగదా! ఇప్పుడిట్లగుటకుఁ గారణమేముండును? అరణ్యములలో మహాతపోవిభవ సంపన్నులైన మునులుందురు. అట్టి మహనీయుల కెవరికేని నీమూఢుఁడు గర్వముచే నొడలు తెలియక యపకారమొనర్చి యిట్టి శాపమునందెనా? లేక ఏదైన పిశాచముసోఁకినదా? ఏదియుఁ దెలియలేదుకదా! ఎఱుఁగు టెట్లు? శకటాలా! నాయీదైన్యము వారించువారెవరు

దైవోపహతుఁడనగు నన్నుద్ధరించువారెవరు? ఏది దారి? అక్కటా! మిత్రుఁడును, సర్వవిద్యావిశారదుఁడును, యోగవిద్యాప్రభావ సంపన్నుఁడు నగు వరరుచి పండితుఁడున్న, నిముసములో నీవంతఁ దొలఁగించియుండును గదా! అధికారమదమునఁ గన్నుగానక యాతనిని జంపించితిని. ఇఁకనెవ్వరి శరణుజొత్తును. హతవిధీ! నన్నీలాగు పరీక్షింతువా? ఏమి చేయుదు నని పరిపరివిధముల నంగలార్చుచుండ శకటాలుఁడు "మహాప్రభూ! వరరుచినిగూర్చి మీరింతగా వ్యథచెందనేల? అంతఃపురద్రోహమొనరించిన యా మహాపాతకి తప్పక వధార్హుఁడు. దేవరవారేల పశ్చాత్తాపపడుచున్నారు" అనెను.

రాజు:—అట్లుకాదు. అమాత్యా! అట్లుకాదు. అతఁడు మహానుభావుఁడు. అతనికిఁ దెలియనివిషయములు సర్వజ్ఞుఁడైన యాశ్వరునికిని దెలియవు. ఆతఁడే యున్నచో నేనింత విచారపడనక్కఱలేదు. ఎప్పుడో నా కుమారుని రుజపోఁగొట్టి, నా హృదయమందలి యారాటముమాన్పి సంతసము కలిగించియుండును. అట్టి హితుని, నా శ్రేయోభిలాషిని, చేతులారం జంపి యిప్పుడు విచారించుచున్నాను. ఆపాప మూరకపోవునా?

శక:—ప్రభూ! ఒకవేళ ఆతఁడు బ్రతికియేయున్నచో?

రాజు:—ఆఁ! బ్రతికియున్నాఁడా! శకటాలా! చెప్పుము, చెప్పుము. ఎక్కడ నున్నాఁడు? అతనికి నా సర్వస్వమిచ్చియైనను నా కృతఘ్నతకు క్షమాపణ వేఁడుకొందును.

అనఁగానే శకటాలుఁడు నాకు భయములేదని తలఁచి, నాయునికిమునుకులంగూర్చి రాజునకు విశదముగా విన్నవించెను.

తరువాత రాజునానతిచే నను(గొలువుకూటమునకు( బిలిపించి, నాకు సర్వము తెలిసియున్నను మఱల రాజునెదుర విప్పి చెప్పెను. నేనంత కుమారుని రావించి, యాతఁడు పలుకు చున్న 'ససేమిరా' యను వాక్యమును బురస్కరించుకొని, యొక్కొక్క యక్షరము మొదటనుండునట్లు నాలుగు శ్లోకము లతో నరణ్యవృత్తాంతము వివరించితిని. వాని భావములివి:—

1. "సజ్జనుఁడగు మిత్రునిఁ గృతఘ్నతాబుద్ధితోఁ జంపఁ జూచుట యెంతటి పాతకమో యెఱుఁగుదువా?

2. సేతువు దర్శించిన సకలకల్మషములు పోవునని పెద్దలు చెప్పుదురు. కాని మిత్రద్రోహపాప మేతీర్థమును సేవించినను నడఁగదుకదా!

3. మిత్రద్రోహి, బ్రాహ్మణహంత, సురాపాయి, స్వర్ణ స్తేయి, వ్యభిచారి, వీరైదుగురు మహాపాపులని యార్యులైన ఋషులు వచించిరి.

4. రాజా! నీకుమారుని యభ్యుదయమునకు, దేవ బ్రాహ్మణతృప్తియు, సర్వభూతములకు మోదమును కలిగిం చుము" అని వివరింపఁగా హిరణ్యగుప్తుని యపస్మారముపోయి, యరణ్యవృత్తాంతమంతయు నాతఁడు నుడువఁగా నందఱు నాశ్చర్యమగ్నులైరి.

రాజు నన్ను సమీపించి కౌఁగిలించుకొని, "మిత్రమా! నీయెడల నేనొనరించిన యపకారము క్షమింపరానిది. నీవంటి యుత్తమస్నేహితు నాపదలపాలు గావించిన నాకెట్టి పాప మంటునో? నన్ను క్షమింపుము. నీవు క్షమించినఁగాని నాయప రాధములు తొలఁగవు. హితవర్యా! నేలమాలెలో నెవ్వరికిఁ

దెలియక రహస్యముగనున్న నీవీయరణ్యవృత్తాంత మెట్లు గ్రహించితివో వినఁ గుతూహలముగ నున్నది" యని యడిగెను.

అందులకు నే "నోరాజా! సరస్వతీప్రసాదమున మహో దేవికటిస్థలమందలి యంకముపోలె మాకెఱుఁగరాని విష యములుండవు" అని పలుకఁగానే లజ్జితుఁడయి రాజు నన్నేక విధములఁ బ్రార్థించి, గౌరవించి, హేమరత్నభూషణాంబరము లొసఁగెను. కాని నేనేదియుఁ గైకొనక యతని ప్రార్థనలను దిరస్కరించి యింటికి వెడలితిని.

అప్పటి పరిస్థితులేమని చెప్పుదును? సర్వము నేనే యని నమ్మియుండిన నా యర్ధాంగలక్ష్మి యుపకోశ నా వధ్యశిక్షావార్త వినినంతనే యగ్నిప్రవేశము చేసినదఁట! మా యిరువురి మరణ వార్త విని నాతల్లి గుండెపగిలి చచ్చినదఁట! ఇఁక నేనెవరికొఱకు సౌఖ్యములు గోరవలయును? కావున సర్వసంగములు త్యజించి, శాంతినాశ్రయించి, తపోవనమునకుఁ బయనమైతిని. నా గురువర్యుఁడును, మామయు నన్నేకవిధముల వారింపఁ జూచిరి. కాని నేనెవరిమాటలను గ్రహింపక తీర్థాటనములు సాగించితిని. ఒకచోట నొక బ్రాహ్మణుఁడు నన్ను గుర్తించి, గౌరవించి, కుశలప్రశ్నాదికములఁ గావించి, తాను పాటలీ పుత్రనివాసినని చెప్పెను. నేనాతని యోగనందునిగూర్చి విచారింపఁగా నాతఁడు ఖిన్నవదనుఁడయి, కొంత తడవూరకుండి యాతని విషాదవృత్తాంతము చెప్పఁదొడఁగెను.

౧౦

"మహాశయా! నందుని విషయ మడిగితిరి. అది యొక విషాద గాథ. మీరు పాటలీపుత్రమును వీడఁగనే నూర్గురు

పుత్రులు మరణించుటచేఁ దనమనమున నడఁగియుండిన శోక మొక్కుమ్మడి యుబికి పైకిరాఁగా శకటాలునికి, యోగనంద నిర్మూలనకార్య ప్రయత్నముల కంతరాయములు లేకుండెను. అయినను బహిరంగముగ నా కార్యము సాధించుటకు నిచ్చ గింపక యుపాయముల వెదకుచుండెను. యోగనందుఁడును బూర్తిగ శకటాలునే నమ్మియుండెను.

ఇట్లుండ నొకనాఁటి సాయంకాలము వాహ్యాళి వెడలి వచ్చు శకటాలునికిఁ దేజశ్శాలియగు నొక విప్రవరుఁడు నేలఁ ద్రవ్వుచుండుట కానఁబడెను. అతనిని సమీపించి శకటాలుఁడు "బ్రాహ్మణోత్తమా! మీరు చేయుచున్న యీ కార్యమేమి?" యని ప్రశ్నించెను.

ఆ బ్రాహ్మణుఁ "డయ్యా! నేను వచ్చుచుండ నా గమన మున కంతరాయము కల్పించి, నా కాలికి గ్రుచ్చుకొనిన యీ దర్భముల్లును నాశనమొనర్చుచున్నాను. నా మార్గ మెప్పు డును నిష్కంటకముగ నుండవలయును. విఘ్నకారుల రూపు నాశనము గావింతును. అట్టి శక్తి భగవంతుఁడు నా కొసఁగి యున్నాఁడు" అనెను.

ఈ మాటలు వినిన శకటాలుఁడు, మహానుభావుఁడగు నాతఁడు కార్యదక్షుఁడని తలఁచి, తన కార్య మాతనివలన నెఱవేర్చుకొనఁ దలంచి, యాతనిని గౌరవముగాఁ దన గృహమున కాహ్వానించి యతిథి సత్కారములఁ గావించి, సకలయు సౌకర్య ముల నొసరించి, యాతఁడు విశ్రాంతిఁ గొన్న యనంతరము మెల్లఁగా సమీపించి, "యార్యా! తమ పట్టుదలయు, తేజో గాంభీర్యములు నసమానములు; తమరు నీతిశాస్త్రకోవిదులని తమ నేర్పు చెప్పకయ చెప్పుచున్నది. ఇట్టి తమ్మర్థించి, నేనొక

మహాత్తర కార్యము నెఱవేర్పఁ దలపెట్టితిని. తమ యాజ్ఞ యైనచో నివేదింతును" అనెను.

చాణక్య నామధేయుఁడగు నా విప్రుఁడు, ముఖమున మందహాస రోచులు వెలుఁగ "అయ్యా! ఎట్టి దుష్కరకార్య మైనను నా నీతికి మించినది కాదు. రాజ్యములు కూల్తును. రాజ్యములు స్థాపింతును. నీ కెట్టి కార్యమునకు నా సహాయ మవసరమో తెలియఁజేయుము. నీ వినయమునకు, నీయం దనుగ్రహము కలిగినది. కావున నీ కార్యము నెఱవేఱినదని తలంపుము" అని పలికెను.

శకటాలుఁ డంత, నింద్రదత్తుఁడు నందశరీరమునఁ బ్రవేశించినది మొదలు వరరుచి వెడలిపోవుటను యోగానందుని చరిత్ర పూర్తిగా వివరించి, శత్రుపుత్రశోకసంతప్తుఁడగు తన హృదయ మాతని వినాశనము గాంచునంతవఱకు శాంతింపదని వివరించెను.

ఆశ్చర్యముతో నెల్ల విషయముల వినుచున్న చాణక్యుఁడు శకటాలునిఁ గాంచి "యింతియేనా? ఇట్టి నందుల వేవురనైనను క్షణమాత్రమున నిర్మూలింపఁగలను. కాని ప్రజలను కన్నబిడ్డలవలెఁ గాపాడు నీ నందుని యనంతరము రాజ్యమును సుస్థిరముగా పాలించుటకుఁ దగిన రాజకుమారుఁడు వలయును గదా! రాజ్య మన్యాక్రాంతము కారాదు. మఱియు నీతని కుమారుఁడు హిరణ్యగుప్తుఁడు కడు దుర్మార్గుఁడు. అతని నెట్లు రాజ్యపీఠమున నుంపఁదగును? ఇఁక నేను విప్రుఁడను. వేదవేదాంగాభ్యాస మొనర్చినవాఁడను. కావున నా యెడ నపకార మొనరించినవారిమీఁద మాత్రమే నా యాగ్రహము జూపుదును. అన్యాయముగా నొకనికిఁ గీడు గావిం

చుట నాకసమ్మతము. ధర్మ విరుద్ధమును. ఈ రెండింటిని సాధించుటకుపాయము లుండిన యోగనందుఁ డిఁక లేఁడని తలంపుము" అని వచింప శకటాలుఁ డిట్లనియెను.

"మహాత్మా! మీరు చెప్పిన రెండును సమకూరఁగలవు. పూర్వ నంద కుమారుఁడగు చంద్రగుప్తుఁడను దక్షుఁడు గలఁడు. అతఁడు రాజ్యపాలనమునఁ గడునేర్పరి. శౌర్య ధైర్య యుతుఁడు. తేజస్వి. అతనిని గాంచిన మీరు వదలరు. ఇఁక యోగనందునికి మీపైఁ గోపము వచ్చునట్లు చేయుట కొక యుక్తి కలదు. ఆ ప్రకారము చేసిన మ

వచ్చును."

"ప్రతిదిన మీయోగనందుఁడు వేలకొలఁది బ్రాహ్మణ్యమునకు సమారాధనము జరుపును. అందగ్రపీఠము గౌరవనీయమైనది. సర్వ వేదవేదాంగ శాస్త్ర పురాణేతిహాసముల నెవ్వఁడు పండితుఁడో యాతని కది నిర్ణయింపఁబడినది. కాని రాజు నాశ్రయించి బ్రతుకు పౌరోహితుఁడు సుబంధుఁడను పండితమ్మన్యునికి ఇపుడది స్థిరముగా నీయఁబడినది. ఆ పీఠమునకుఁ బండితపీఠమనియే పేరు. మీవంటి పండితప్రకాండు లా పీఠమున కర్హులు. కావున రేపు ముందుగా మీ రా పీఠ మలంకరించిన యెడల, సుబంధుని పక్షమున నీ రాజు మిమ్మధిక్షేపింపఁగలఁడు. తరువాత మీ యిష్టము వచ్చినట్లు కలహము పెంచవచ్చును" అనియెను.

మఱునాఁడు భోజనశాలయందు గుసగుస లారంభమైనవి. వెలికుబుకుట కెవ్వఁడును సాహసింపలేదు. అగ్రపీఠమున నెవ్వఁడో విదేశీయుఁడగు బ్రాహ్మణుఁడు తేజస్వి కూర్చుండి యుండెను. ఇతఁడెవఁడా యని యందఱకును సందియ ముద

యించెను. ఒకరి నొకరు ప్రశ్నించుకొనుచుండిరి. కొంద ఱెవఁడో దాక్షిణాత్యుఁ డనిరి. మఱికొంద ఱెవఁడో మహా పండితుఁ డనిరి. ఇంకఁ గొందఱు నేఁడు సుబంధులవారికిఁ బరిభవకాల మనిరి. ఇట్లనుకొనుచుండఁగనే రాజగురుఁడు విద్య లేకున్నను, డంబమును జాటు నలంకారములతో ఠీవి మెఱయ నేతెంచి తన స్థానమున నన్యుఁడుండుటఁ జూచి, యాశ్చర్యక్రోధములు పెనఁగొనుచుండ నాతనితో "అయ్యా! ఆ స్థానము మీకుఁ గాదు. నా కొఱకయి ప్రత్యేకింపఁబడినది. వేఱొకచోటఁ గూర్చుండుఁ" డని పలికెను. చాణక్యుఁడు బెదరక, స్థిరచిత్తుఁడయి, "అయ్యా! ఇది పండితస్థానము కాదా! ఏ పండితుఁడైనను నే విద్యయందైన నన్నోడించి యీ స్థానమును బడయవచ్చును. అంతదనుక నే నీ చోటు వదల" నని స్పష్టముగఁ జెప్పెను. సుబంధుఁ డేమి చేయుటకును దోఁపక క్రిందుమీఁదుఁ జూచుచుండెను. వినుచుండిన బ్రాహ్మణు లెల్లరు సుబంధుని దైన్యస్థితికిఁ బరిహసించుచుండిరి.

ఇంతలో నీ విషయ మెట్లో ప్రభువునకుఁ దెలిసెను. అతఁడు వెంటనే యరుదెంచి, చాణక్యునిం గాంచి, యా పీఠము వదలి వేఱొకయెడఁ గూర్చుండ నియోగించెను. కాని చాణక్యుఁడు సుబంధుని కిచ్చిన సమాధానమే యొసఁగెను. నందుఁ డది వినిపించుకొనక కోపోద్రిక్తుఁడై యీ బ్రాహ్మణ జడు నావల కీడ్వుఁడని యాజ్ఞాపింపఁగనే నల్వురు భటులు చాణక్యు నవ్వల కీడ్చివైచిరి. ఆ లాగుటలో నాతని కేశబంధము వీడుటయు, నాతఁడు క్రింద పడుటయు జరిగినది. చాణక్యుఁడు దండతాడిత భుజంగమువలె 'బుస్సు' మని లేచి, యవమాన పావక దగ్ధమానసుఁడై కన్నుల మిడుఁగురులు రాల

కర్కశస్వరంబున "రాజాధమా! రాజ్య గర్వమున యోగ్యతా యోగ్యత లెఱుంగక సర్వవిద్యావిశారదుఁడను, నైష్ఠికుఁడునగు నన్నవమాన పఱచితివి. సర్వశక్తిసంపన్నుఁడయ్యు, ప్రమథావతారుఁడగు వరరుచి, శాంతిస్వభావముచేతను, స్నేహభావముచేతను, నిన్నుఁ బూరికంటె నల్పముగా నెంచి, నీ వాతనియెడఁ గావించిన పరాభవమునకుఁ బ్రత్యపకృతి సేయఁడయ్యె. నేనట్లు కాక నీ వినాశనమును గాంచువఱ కిదిగో! నీ భటులు లాగుటవలన వీడిన యీ ముడిని ముడుచుట లేదు. జ్ఞప్తియందుంచుకొనుము. నీ యాయువు మూఁడినది. నిన్ను దేవతలైనను రక్షింపఁజాలరు. కాచుకొను" మనుచు వెడలిపోయెను. అతఁడట్లు పలుకుచున్నప్పుడును, వెడలునప్పుడును భయాశ్చర్యమగ్నమానసులై విందమాఁకిడిన యట్లందఱును నిశ్చేష్టులై యుండిరే కాని, రాజనిందకుఁడగు నా బ్రాహ్మణు నొక్కరును బట్ట సాహసింపకుండిరి.

ద్వారమునఁ గాఁచియున్న శకటాలుఁడు కోపోద్రిక్తుఁడై భోజనశాల వెలువడి వచ్చుచున్న చాణక్య ననుసరించి, యింటికిఁ గొనిపోయి పూర్వ నందపుత్రుఁడైన చంద్రగుప్తుని రావించి యాతని కప్పగించెను.

౧౧

ధనముగాని, సైన్యముగాని లేని చంద్రగుప్తునితోఁ జాణక్యుఁడు తన సహపాఠియు, శుక్రవిద్యావిశారదుఁడును, రాజనీతిజ్ఞతయందుఁ దనతో సమానుఁడు నగు నిందుశర్మను గలసికొని, యావద్వృత్తాంతమును వినిపించి, "స్నేహితుఁడా! ఇందు నీ సహాయమును గొంత కావలసియున్నది. నీ విద్యా

కొందువని తలంతు" నసఁగా నిందుశర్మ "చెలికాఁడా! నీ కార్యములందు నేనెప్పుడు సహాయపడలేదు? నీవెట్టి పనుల యందు నియోగింతువో వానిని తప్పక నాశక్తికొలఁది నెఱవేర్తు" నని యియ్యకొనెను.

అంతఁ జాణక్యుఁ డిందుశర్మతో "నోయీ! నీవు పాటలీపుత్రమునకరిగి, నందునికి దుర్బోధలొనరించి, దైవబ్రాహ్మణుల మీఁది భక్తి తొలఁగునట్లు చేయుచుండుము. మఱియుఁ బ్రధానులగు పురుషుల కాతనిపై నలక్ష్యము పెరుగునట్లు కావించుచుండుము. నీకన్నివిధముల నచ్చట శకటాలమంత్రి సాయపడును" అని బోధించి పంపెను. ఇందుశర్మ క్షపణక వేషధారియై పాటలీపుత్రమును బ్రవేశించి, తన యుద్యోగమును జాగ్రత్తతో నెఱవేర్చుచుండెను.

చాణక్యుఁడు చంద్రగుప్తుని వెంటనిడుకొని పర్వత రాజ్యాధిపతియొద్దకు వెడలి, యాతనికి సగము రాజ్యముపై నాసఁ గల్పించి, పాటలీపుత్రముమీఁదికి దండు విడియించెను. ఆ దండయాత్రలో నందుని, ఆతని పుత్రుని జిత్రవధ చేయించెను. ఆ సింహాసనమునకు భాగస్థుఁడైన పర్వతరాజును మాయోపాయముచేఁ దుద ముట్టించెను. ఎట్టి యాటంకమును లేని మగధసామ్రాజ్యమునకుఁ జంద్రగుప్తుని రాజును జేయఁగా, శకటాలుఁడు తన ప్రతిజ్ఞ నెఱవేఱుటచేఁ జాణక్యుని నిందుశర్మను మంత్రులఁగావించి, తాను మహాప్రస్థానయాత్రకు వెడలెను."

అని యా బ్రాహ్మణుఁడు నందవినాశన మామూలాగ్రము వినిపింపఁగా మనమునఁ జింతించి, "ఔరా! అంతటి యోగవిద్యావిశారదునకు, రాజ్యగర్వముచే నెంతటి నికృ

ష్టపుఁజావు కలిగిన” దని మిపులఁ గుందితిని, అతఁడు నా సహాధ్యాయియుఁ, గొన్నాళ్లు నాకుఁ బోషకుఁడును గదా!

ఇట్టి సుస్థిర రాజ్యములు, రాజులే నశించుచుండఁగా, నిఁక నేది శాశ్వతమని నిశ్చయించి, వింధ్యవాసినిని ధ్యానించి ముక్తిఁ బొంద నిచ్ఛగలవాఁడనై యచ్చటికి రాఁగా నా మహామాత నిన్ను దర్శింప నాదేశించెను. ఆ దేవి యానతిఁ దలఁదాల్చి నేనిచ్చటికి రాఁగా నీ దర్శనమాత్రముననే నాకుఁ బూర్వజన్మ జ్ఞానము కలిగినది. ఓ కాణభూతీ! నీవుకదా, నా శాపవిమోచన కారకుఁడవు? ఇఁక నీకా పార్వతీ పరమేశ్వరు లేకాంతమునఁ జెప్పుకొనిన కథ నామూలాగ్రముగ వినిపించెదను. విను” మని, కథను వివరించి, యాతని వీడ్కోలువడసి వరరుచి, వింధ్యవాసిని యనుగ్రహమున మానవదేహము వదలి ప్రమథులలో గలియుటకై పయనమాయెను.

వరరుచి యట్లరుగుచుండ దారిలో నొక గుహాయందు నొక తపస్వి, ధ్యానమప్పుడే విరమించి, దర్భలు చక్కఁజేసికొనుచుండఁగా నొకటి వ్రేలియందు గ్రుచ్చుకొని రక్తము స్రవించుచుండెను. ఆ రక్తమును వరరుచి శాకరసముగాఁ, తన యోగప్రభావముచే మార్చఁగా, నా తపసి యది తన ప్రభావముగా నెంచి, సిద్ధుఁడనైతి నను సంతసమున గంతులిడుచుండెను. వరరుచి యాతనిని సమీపించి “యయ్యా! నీ యుత్సాహమునకుఁ గారణమేమి? దైవదర్శనము లభించినదా! ఊరక నృత్యముఁ గావించుచు గంతులిడుచున్నావు” అని ప్రశ్నింపఁగా నాతఁ “డోయీ! బ్రాహ్మణా! కాంచితివికదా! నా యీ వ్రేలిరక్తము నా యోగసిద్ధిచే శాకరసముగా మారినది. నేనెంత తపఃప్రభావ సంపన్నుఁడను? ఎన్నియో సంవ

త్సరములుగా భగవంతుఁడగు మహేశ్వరునిగూర్చి తపమాచరించుచుంటిని. నేఁటికి నా పంట పండినది. ఇది నాకు సంతోషసమయము గాక మఱేమి? అందుచే నిట్టి యుత్సాహమున నున్నాఁడ"నని ప్రత్యుత్తర మిచ్చెను.

వరరుచి యా యుత్తరమును విని, "ఓహో బేల జోగీ! పల యూరక గర్వోక్తులాడెదవు? నీకు యోగము సిద్ధించినదని నమ్మకమేమి? ఈ గర్వముచేతనే నీవింతకాలము చేసిన తపము వ్యర్థమైనది. చూడుము నీ వ్రేల కాఱునది శాకరసమో! రక్తమో!" యని శాకరసమును రక్తముగా మార్చెను. అతఁడు తెల్లఁబోయి వరరుచిని జూచి, "మహాత్మా! తామెవ్వరో మహామహిమాసంపన్నులు. మీవలన నా గర్వము నశించినది. నా తపము ఫలింపవలయునని యాశీర్వదింపుఁడు" అనఁగా, నాతనితో "గర్వమును మాని, నియమములతో, నిలుకడతో ధ్యానముసేయు" మని బుద్ధిగఱపి, యాతని వీడ్కొలు నడసి కతిపయ ప్రయాణముల వింధ్యవాసినిని సమీపించి, యచట ధ్యాన నిమగ్నుఁడై యామె యనుగ్రహమున మానవదేహమును వీడి దివ్యగతినంది, పూర్వపదవి నధిష్ఠించెను.

## గుణాఢ్యుఁడు

### ౧

సకల పాప పరిహారణ దక్షంబై, శివప్రోక్తమైన బృహత్కథ నామూలాగ్రముగ వరరుచి పండితునిచే సావధానముగ నాలకించిన కాణభూతి, చాలకాలమువఱకు గుణాఢ్యుని యాగమనమునకుఁ బ్రతీక్షించి, కానక, యిట్లు చింతించెను. "నాశా

పావసానసమయ మింకను బ్రాపింపలేదు కదా! అకటకటా! ఎన్నిదినము లీ నికృష్టదేహముతో జీవింపవలయును? భగవంతునికి నాపై కరుణరాలేదు కదా! ఆ గుణాఢ్యుఁ డెచ్చటివాఁడో కదా! ఎప్పుడిచ్చటి కరుదెంచునో కదా! నా హితుఁడు భూతివర్మ నడిగిన యీ విషయము తెలియునేమో!" యని తలంచి, తన హితుండును, దివ్యజ్ఞాన సమేతుండును, నగు భూతివర్మను, నుజ్జయినీనగరవాసినిఁ గాంచ నేఁగెను. మిత్రునిరాక గ్రహించిన భూతివర్మయు నెదురేఁగి, సత్కారము లాచరించి, మిత్రుని జూచి, "ఓయీ! హితుఁడా! చాలకాలమయ్యెఁ గదా మన పరస్పర సందర్శనము జరిగి? ఇప్పటి నీరాక రాకాచంద్రుని రాకకుప్పొంగు నీరాకరమువలె నాకు సంతసముం గూర్చెను. విశేషము లేమియు లేవుకదా!" యనఁగా గాణభూతి, "చెలికాఁడా! గుణాఢ్యపండితుని దర్శనముచే నా శాపవిముక్తి యని నీ వెఱుఁగుదువు కదా! నేనా మహనీయుని రాకకై యెదురు సూచుచున్నాఁడను. ఇంక నెంతకాల మీరీతిఁ గుందవలయునో యెఱుఁగుటకయి, యెఱుకగల నీయొద్ద కరుగుదెంచితిని. నాకెప్పుడు శాపవిముక్తి యగునో జ్ఞానచక్షువగు నీ వెఱిఁగింతువని తలంచుచున్నాను. నా కోరిక రిత్తసేయక పంపుదువని ప్రార్థించుచున్నాను" అనఁగా భూతివర్మ యిట్లనియెను.

"సుహృద్వరేణ్యా! దివ్యజ్ఞానము నాకున్న విషయము నిజమే యయినను, కాననాంతరమునఁ బిశాచమనైన నాకుఁ బగలాశక్తి నశించును. రాత్రివఱకు వేచియుంటివేని నీ కోరికఁ దీర్తును" అని పలుకఁ గాణభూతి సమ్మతించి, యచటనే యుండెను. ఆ మిత్రు లిరువురు నిష్టకథాలాపముల నాఁటి సాయంకాలము దనుక ప్రొద్దుపుచ్చిరి. అంత భూతివర్మ కాణ

భూతితో "నో మిత్రమా! నీ శాపవిమోచన కాలమాసన్న మైనది." నీవేఁగుమనుటయు సంతోషమున మిత్రుని వీడు కొలిపి, కాణభూతి తన నివాసమగు వటమహీరుహము చెంతకు వచ్చెను.

అటఁ దనకొఱకే నిరీక్షించుచుండిన మహాతేజస్వి యగు నొక బ్రాహ్మణుని గాంచి, "మహాత్మా! తామెవ్వరు? ఎచ్చటినుండి యిచ్చటికి వచ్చితిరి? తమ విషయము వివరింపుఁ" డన నాతఁ డిట్లనియె.

"ఓయీ! భూతివర్యా! వినుము. సకలభువన మకుటాయమానమై ప్రతిష్ఠానమను దేశము ప్రకాశించుచుండును. అందు సుప్రతిష్ఠితమను పట్టణము వేదవేదాంగ విమలగు బ్రాహ్మణోత్తములకుఁ బుట్టినిల్లు. సకలవిద్యల నభ్యసించి, తనకు సమానుఁడుకాని, యధికుఁడుగాని యే లోకమున లేఁడని ప్రఖ్యాతి సహించిన సోమశర్మాభిధానుఁడు బ్రాహ్మణోత్తముఁడు గలఁడు. అతని నాశ్రయించి పెక్కుఱు బ్రహ్మచారులు విద్యాభ్యాసము చేయుచుందురు. అతని గృహ మెప్పుడును వేదనాదములతో మాఱుమ్రోఁగుచు నుండును. ఆ శ్రావ్యమగు వేదగానమును వినఁ గుతూహలపడి, యప్పుడప్పుడు దేవతలు సైతము మానవాకారముల ధరించి వాకిట నిశ్శబ్దముగ నుందు రనుటలో నతిశయోక్తిలేదు.

ఆ మహనీయున కిరువురు పుత్రులు. వారు వత్సగుల్మక నాములు. విద్యా విషయమునఁ దండ్రితో సమానులు. వారి వేదాధ్యయనము నాలించినవారు తండ్రియే పుత్రరూపమున నిరుగురుగ నవతరించి పలుకుచున్నాఁడా యనిపించును. వారి కొక సోదరి కలదు. ఆమె పేరు శతరూప. విద్యావ్యాసంగ

ముల సోదరుల సాహచర్యముండుటచే నామెయు వారియంతటి దయ్యెను. విద్యకుఁదోడు వినయ రూప సౌశీల్యాది సద్గుణ గరిష్ఠ. అట్టి మువ్వురాత్మజాతులఁ గాంచి, సోమశర్మయు నాతని యిల్లాలును మిక్కిలి మురియుచుండిరి.

ఇట్లుండ నా యువకుల గ్రహచారబలమో, లేక కాలము తీఱినదో, యా తలిదండ్రు లిరువురు నేక కాలమున నిహలోక సౌఖ్య సంబంధముల రోసినవారివలె నన్నియు వదలి, యనంతమై, నిత్యసౌఖ్యదమైన మోక్ష సామ్రాజ్యమును జేరిరి. వారి మరణమునకు పుత్రులేగాక పట్టణ ప్రజలును విచారించిరి. అనునయించు బందుగులు లేక వత్సగుల్మకులు, తమకుఁ దామ శాంతినంది, సోదరి శతరూప ననునయించి, విద్యా ప్రభావమున సంసారము సాగించుచు, నెట్లో పితరుల వియోగమును మఱచి కాలము గడపుచుండిరి.

అంతఁ గొంతకాలమునకు శతరూపయందు గర్భచిహ్నము లగపడెను. దానింగని వత్సగుల్మకులు, తమ మనంబుల "అక్కటా! నిర్మలమైన వంశము, మహాసాధ్వియగు జనని, నిరంతర వేదాధ్యయన తత్పరుఁడగు తండ్రి, మచ్చగాంచునట్లీ కులట కీదుర్గుణ మెట్లబ్బెను? దీని తోఁబుట్టు వనుటకంటెఁ బాపము కలదా? ఎంత సాహసమున కొడిగట్టినది? దీని నేమి చేసిన పాపము తీఱు" నని తమమనములఁ గుందుచు, దాక్షిణ్య వశముచేఁ జెల్లెలి నడగలేక, నిత్యవిధులైన నాచరింపక కృశించుచుండిరి.

అన్నలహృదయములందలి యగ్ని నెఱిఁగి శతరూప యొక నాఁడు, "అన్నలారా! మీరేల చింతాసాగరమున మునింగి, దిక్కుతోఁచక యున్నవారు. చింతాగ్ని చితాగ్నికంటె

బలీయమై సజీవమగు దేహమును గాల్చునని మీ రెఱుఁగరా? అట్టి విచారమునకుఁ జోటీయఁదగునా? మీ విచార హేతువు నే నెఱుఁగుదును. కాని మీరయి నాతోఁ బ్రస్తావింతురని తలంచితిని. నిజ మరయుటకును, నన్నడుగుటకును ధైర్యము చాలక యిట్లు కృశించుచున్నారు. ఉన్న విషయ మడిగినఁ దప్పేమి? నా విషయమిఁక నాలకింపుఁడు."

"సకల భువనములను దన వేయిపడగలపై వహించి, రక్షించు సర్పరాజు వాసుకి యున్నాఁడుగదా! అతని తమ్మునికిఁ గీర్తిసేనుఁడను కుమారుఁడు గలఁడు. అతఁడు సకల సద్గుణ పరిపూర్ణుఁడు. నవనవోన్మేష యౌవనుఁడు. అనితర సౌందర్య విలాసుఁడు. ఆ నాగకుమారుఁడు నే నొకనాఁడు గంగా స్నానమున కేఁగుచుండ నా రూపమునకు ముగ్ధుఁడై, మదన తాపమున నలసి, నన్ను సమీపించి, తన వంశము గొప్ప తనమును, కీర్తి విస్తృతియుఁ దెలిపి, గాంధర్వవిధిచేఁ బెండ్లి యాడెను. ఈ గర్భ మాతనిచే నాకుఁ గలిగినది. మీ రిఁక నా విషయమున నిర్విచారముగ నుండుఁడు."

అనఁగా వారామెను జూచి, సోదరీ! నీవన్యథా వర్తింపవని మాకుఁ దెలియును. అయినను లోకము పలు తెఱగు లయినది కదా? దాని మాయ మాఁకుడున్నదే? నీ పాతివ్రత్యము నిరూపించుకొనుదాఁక మే మియ్యది నమ్మఁజాలము. నీ కలంకముఁ బాయదు. జనాపవాదముఁ దప్పదు. అందుచే నీకుఁ బెక్కు కష్టములు దాపరించుట నిస్సంశయము. అంతియ కాదు. మాకును, సద్వంశజాతులు, సర్వశాస్త్ర పారంగతులు, సాధుశీలురు, సత్కర్మనిరతులు నగు పితరులకును నపయశ మాపాదించినట్లగును. తరువాత నీ స్టము" అని వచించిరి.

అంత నామె భక్తితోఁ దనపతినిగూర్చి ధ్యానింపఁగా, ముత్యాల హారములు, భుజకీర్తులు, మణికుండలములు, కిరీట ములు మున్నగువానిచేఁ బ్రకాశించువాఁడును, పీతాంబరమును ధరించినవాఁడును, ఆజానుబాహువులు విశాలవక్షముకలిగి, పద్మముల నిరసించు నేత్రములతో నొప్పు నాగకుమారుఁడు ప్రత్యక్షమై, "యో విప్ర కుమారులారా! మీ సోదరి శతరూప పతివ్రత. ఆమెయందెట్టి పాపమును లేదు. పూర్వజన్మమున నీమె యొక యప్సరస, మీరు గంధర్వులు, శాపవశమున నిట్లు పుట్టితిరి. మీ ముగ్వురకు నీమె ప్రసవించునంతకే శాపావధి. అనంతరము మానవదేహములు చాలించి, నిజరూపములతో మీ లోకమున కేఁగుదురు" అని వచించి యాతఁ డంతర్హితుఁ డయ్యెను. వత్సగుల్మకులు సోదరి విషయమై నిస్సందేహముగాఁ బ్రవర్తించుచుండిరి. పట్టణవాసులును, వారి ప్రభావ విశేష మునకు, శతరూప యదృష్టమునకు సంతసించిరి.

ఇట్లు కొన్నిదినములు గడువఁగా శతరూప తమ శాప బంధనముల ఛేదించుటకుఁ గుఠారమువంటివాఁడును, దేజశ్శా లియునగు కుమారునిఁ బ్రసవించెను. అతని జనన సమయమున నశరీరి "వీఁడొక ప్రమథుఁడు. శాపవశమున నిట్లుద్భవ మందెను. వీని పేరు గుణాఢ్యుఁడు" అని వినిపించెను. పిమ్మట శాపావసానము కాఁగా నా పిల్లవాని తల్లియు, మేనమామలును తమ మానవ శరీరముల వదలి దేవత్వము నందిరి. పౌరులా కుమారునిఁ జేరఁదీసి లాలించిరి. ఓ కాణభూతీ! ఆ కుమా రుఁడే నేనని గ్రహింపుము."

తలిదండ్రుల నెడఁబాసిన నేను ప్రసుధావతారుఁడనని తెలిసినంతనే పౌరు లల్లారుముద్దుగా నన్నుఁబెంపసాగిరి. ఒక గృహిణి స్నానమాడించుచు, నింకొక యువిద మితముగా నన్నంబు గుడుపుచు, నింకొక యిల్లాలు సిగముడుచుచుఁ గాపాడుచుండ నైదేండ్ల ప్రాయము వాఁడనైతిని. వేదాధ్య యన సంపన్నుఁడగు నొక బ్రాహ్మణుఁడు నా తేజమునకు ముది తుఁడై కనికరించి విద్యాభ్యాసము చేయించెను. అతఁడెఱిఁ గిన విద్యయంతయు శీఘ్రకాలమున నభ్యసించుటచేత విశేష విద్యల గ్రహింపవలయునను కుతూహలమున, దక్షిణ దేశము నకు వెడలితిని. అక్కడ ననేకపట్టణములఁ ద్రిమ్మరి యనేకు లగు పండితులకడ వివిధ శాస్త్రములఁ బూర్తిగా నభ్యసించి, నాయంతటి పండితుఁడు లేఁడను కీర్తి గడించి యింటికి మరలితిని.

నా తిరోగమనమున నచ్చట నచ్చటఁగల రాజాస్థానముల దర్శించి యందలి యుద్దండులగు పండితుల శాస్త్రచర్చలయం దోడించుచు, సుప్రతిష్ఠితమునకు వచ్చితిని.

అప్పటి యీ నగరవైభవ మేమని చెప్పుదును? ఒక ప్రక్క సామవేదవిశారదులగు విప్రవరులు శ్రవణసుఖముగా గాన మొనరించుచుండిరి. ఇంకొక దెస బ్రాహ్మణోత్తములు వేదార్థముల విప్పిచెప్పుచు సంశయముల నివారించుచుండిరి. మఱియొకదిక్కున బ్రహ్మచారులు నానాశాస్త్రాభ్యాసములఁ గావించుచు, చర్చించుచు, గురుప్రోక్తములైన పాఠముల వల్లించుచు మురిపెముగూర్చుచుండిరి. ఒండొకకడ క్షత్రియ కుమారులు మల్లవిద్యాభ్యాస మొనర్చుచుండిరి. వేఱొక

వలను వణిక్కుమారులు బేహారమందలి లాభనష్టముల నరయుచుండిరి. ఇంకొక క్రేవ జూదగాండ్రు తమ తమ నేర్పులం జూపుచు, సమీపించినవారి ధనమును జూచు చుండఁగనే యపహరించుచుండిరి. మఱియొకవాడఁ బణ్యాంగ నాజనము తమ విటులతో సరసములాడుచు నవ్వుచుండిరి. ఇట్టి యా పట్టణమును ప్రవేశించి పూర్వపరిచితిగల యాత్మ సఖులఁ గొందఱఁ బలుకరించి, రాజభవనమునకు దారి తీసితిని.

ఆ మేడ సొంపేమని వర్ణింతును? దిక్పాలుర భవనములును దానికి సాటిరావన భూలోకభవనముల మాట చెప్పనేల? అట్టి దానిని సమీపించి, ద్వారపాలురచే లోనికిఁ జెప్పిపుచ్చి యనుజ్ఞాతుండనయి, ప్రవేశించి, కక్ష్యాంతరములు గడచి, సకలసురవారాని సేవితుండగు మహేంద్రునివలె నిజమంత్రి సామంత పురోహిత దండనాథ కవీంద్ర సమూహముచేఁ బరి వేష్టితుండయి పేరోలగమున్న సాతవాహన సార్వభౌమునిఁ గాంచి, యాశీర్వదించి, యాతని యాదేశప్రకారము గూరు చుండి, నా కథ నామూలాగ్రముగా విన్నవించితిని.

నాకథ విన్న రాజు విస్మయమున నుండ, సకలశాస్త్ర కోవిదుండగు మహామాత్యుఁడు శర్వవర్మ యిట్లనియెను. "రాజేంద్రా! ఇతఁడు నీతిశాస్త్రవిదుఁడు. తేజస్వి. రాజకార్య ములయందు మన కనేకవిధముల సాయపడఁగలఁడు. కాన నమాత్యవర్గమున నొకఁడుగా నియోగింపఁదగినవాఁ" డనఁగా, రాజచంద్రుఁడు నన్నుఁ బ్రస్తుతించి, సత్కరించి, మంత్రివర్గమున నొక ముఖ్యునిఁ గావించెను. నేనాతని మనసునకెక్కుఁ బ్రవ ర్తించుచుంటిని.

అంతవఱకు నాశ్చర్యంబునఁ గథ నాలించుచుండిన కాణ భూతి, గుణాఢ్యునిఁ జూచి "ఓ పండితవరేణ్యా! నాకొక సందియము గలదు. నాకించిజ్ఞతకు మన్నించి సెలవీయ వేఁడెదను. ఆ మహారాజేంద్రునకు "సాతవాహనుఁ" డను నామ మేల కలిగినది? మీ రెఱుకయేని తెలుప వేఁడు చున్నాఁడ" నని ప్రార్థించెను. అనంతరము గుణాఢ్యుఁడిట్లు చెప్ప నారంభించెను.

ఈ నరపతి తండ్రి దీపకర్ణిమహారాజు. అతని పరాక్ర మము సమానము లేనిది. అతఁడు మన్మథుని, జయంతుని జయించు రూపవిలాసములు గలవాఁడు. గొప్ప పండితుఁడు. ఆశ్రితులకు పారిజాతము. అతని కొలువుకూటము నిరంతరము కవులు, పండితులు, గాయకులు, శిల్పులచేఁ గ్రిక్కిరిసియుండును. అతని సద్గుణముల వక్కాణింపఁజాలిన పండితుఁ డీలోకమున లేఁడు. అతని భార్య శక్తిమతి; ఆమె సౌందర్యము దేవతా స్త్రీలయందును లేదనిన నతిశయోక్తి కాదు. ఆమె యెల్లప్పుడును దన పతి సౌఖ్యమునే కోరుచు నాతని నానంద సాగరవీచికల నూఁచుచుండును. ఆ దంపతుల యన్యోన్యస్య మసమానము. ఇరువురు నెల్లప్పుడు భగవదారాధన తత్పరులు. వారెట్టి చీఁకు చింతలు లేక సౌఖ్యమున నుండిరి. కాని దేవిని మాత్రము పుత్రులు లేరను చింత యప్పుడప్పుడు బాధించు చుండును.

ఇట్లుండ వారి సుఖసంపదల నోర్వని విధాత సర్పరూపుఁ డయి శక్తిమతి ప్రాణానిలములఁ గొనిపోఁగా హృదయము దహింప నారాజపుంగవుఁ డితరకార్యముల మఱచెను. తన కనుకూలయు, ప్రేమాస్పదయు, నగు రాణి మరణించినదే

యైహిక సుఖములవీడి బ్రహ్మచర్య మవలంబించి, ప్రజాహి తైషియై యిలాపాలనంబు గావించుచుండెను. పురప్రముఖులు నమాత్యులు పునర్వివాహమునకయి యెంత ప్రోత్సహించినను దలయొగ్గఁడయ్యెను. కాని తన యనంతరము రాజ్యపాల నార్హుఁడగు పుత్రుఁడు లేకుండుటకు నప్పుడప్పుడు తన మనమునఁ జింతించి, యంతయు దైవాధీనమని భక్తితత్పరుఁడై సాంబమూర్తిని ధ్యానించుచుండెను. అంత నొకనాఁటి రేయి భక్తజన సులభుఁడగు గౌరీశుఁడు స్వప్నమున సాక్షాత్కరించి "ఓ రాజన్యా, నీభక్తికి మెచ్చితిని. నీ కోరిక నెఱుఁగుదును. సమీపవనాంతమున కేఁగిన సింహవాహనుండగు నొక యర్భకుఁడు కనిపించును. వాని నీ కుమారునిగా గ్రహింపుము" అని యాజ్ఞాపించి యంతర్హితుఁడయ్యెను.

రాజాస్వప్నమునకుఁ గడునలరి యుదయముననే యమాత్యుల రావించి, వారితోఁ దన స్వప్నవృత్తాంతము నివేదించి వారి యాలోచనము ననుసరించి, విపినమునకు మృగయా వినోదార్థ మరుగ సాంబమూర్తి సచనానుసారము కంఠీరవ వాహనుండగు నొక బాలకుఁడు కనిపించెను. ఆ హర్యక్షము సమీపకాసారమున కేఁగి తీరమున బాలుని దింపి, నీరు త్రాగుచుండ, రాజొక్క యమ్ము వింట సంధించి, యాకర్ణాంత ముగ లాగి, సింగముపైఁ బ్రయోగించెను. ఆతూఁపు తాఁకుటయు, సింగపుటొడలు విడిచి యట నొక దివ్యమూర్తి కానిపించెను. ఆ రాజాశ్చర్యమున నాతని సమీపించి, చూచుచుండ నాతఁ "డో రాజా! నేను సాతుఁడను యక్షుఁడను; కుబేరమిత్రుఁడను. నేనొకపరి గంగాతీరమున విహరించుచు నందు స్నానపరాయణయైయున్న యొక మునికన్యకను జూచి

మోహించితిని. ఆమెయు నాయందుఁ దగులువడి తన ప్రేమ మెఱుకసేయ, సమ్మతించి యిరువురము గాంధర్వవిధిని వివాహము చేసికొంటిమి. అంత నామె బందుగులగు బ్రాహ్మణులు మా స్వేచ్ఛావిహారములకుఁ గని "దుర్మార్గులారా! స్వేచ్ఛావిహారులైన మీరు సింగంబు లగుదురుగాక! యని శపియించిరి.

మేమా శాపమునకు వెఱచి, దుఃఖించి, యా బ్రాహ్మణుల పాదములపై వ్రాలి మా తప్పిదముల క్షమింపవేఁడుకొనఁగా శాంతించి, "మా శాపము వృథా కాదు. ఈమెకు సంతానప్రాప్తిపర్యంతమును, నీకు దీపకర్ణిసార్వభౌముని బాణాహతినఱకును శాపముండు"నని వచించిరి. ఆ శాపానుసారము మేము వెంటనే సింగములమయి యరణ్యముల స్వేచ్ఛావిహారములు సలిపితిమి. కొంతకాలమునకు శాపగ్రస్తయగు నా భార్య గర్భము ధరించి, యీ యర్భకుని ప్రసవించి, శాపము తీరఁగా దివ్యగతిని బొందెను. బాలభానుసమానతేజుఁడగు బాలకు నితని సింహికలపాలచేఁ బెంచి కాపాడుచుంటిని. నా యదృష్టవశమున నీ బాణము తాఁకుచే శాపము తీరినది. సింహాసనార్హుఁడగు నీ బాలకుఁడు నీకుఁ గుమారుఁడగునని యా ఋషులే వచించిరి. కాన వీనిని బుత్రునిఁగాఁ బరిగ్రహింపుము" అని పలుకుచు నాతఁ డంతర్ధానమందెను.

అవనీపతియు శివవరప్రసాదియగు నా బాలుని సంతసమ్మునఁ గైకొని ప్రతిష్ఠానమున కరుగుదెంచి, వానికి సాతుఁడు వాహనమైనందున సాతవాహనుఁడను పేరు పెట్టి, తగు రక్షణ లొనరించి కాపాడుచుండెను. కాలక్రమమున నా యర్భకుఁడు శౌర్యాలంకారుఁడయి రాజోచితవిద్యల నభ్యసించి, యూప

నుఁడైనంత, దీపకర్ణిసార్వభౌముఁడు తన సామ్రాజ్యమున కాతని నభిషేకించి, తపోనియతికై యడవుల కేఁగెను.

సాతవాహనుఁడు పాలకపితృదత్తసామ్రాజ్యమును జేపట్టి, కులక్రమాగతులగు నమాత్యుల యాదేశానుసారము ప్రజారంజకముగా రాజ్యము సేయుచున్నాఁడు. ఇది యాతనికి సాతవాహనుఁడనుపేరు వచ్చుటకుఁ గారణము. ఓ కాణభూతీ! తరువాతి నా కథ నాలింపుము.

దినదినాభివృద్ధి నందుచున్న విశ్వాసముచేతను గౌరవముచేతను సాతవాహనమహీపాలుఁడు నన్ను మన్నింప, నేనును నెవ్వరేయు మిగుల నేర్పుతో రాజకార్యములు నిర్వహించుచుండ, నతఁడు నిర్విచారుఁడై, యెల్లప్పు డంతఃపురమున నివసించుచు సౌందర్యవిరాజితులైన యంగనల సమూహముతో సౌఖ్యము లనుభవించుచుఁ బ్రొద్దులుపుచ్చుచుండెను. నందన వనముతో సమానములగు నుద్యానవనముల విహరించుచు, పుష్పములచే నలంకరింపఁబడిన జలయానములలో భార్యాసమేతుఁడై తిరుగుచు, విమలపద్మాకరములలో జలక్రీడ లాడుచు, యువతీసమూహముతోఁ బరిహాసములాడుచుఁ గాలము గడపుచుండెను.

అప్పుడప్పుడే వికసించిన పూలవాసనలకు ముసురుచు ఝుమ్మని రొదసేయు తుమ్మెదలును, లేఁజివురాకుల మెసవి క్రొవ్విన యెలుఁగులెత్తి కుహూకారముల సలుపు కలకంఠ సమూహములును వసంత మేఁగుదెంచెనని చాటెను. శృంగారప్రియుఁడగు నా రాజచంద్రుఁడు, తన కాంతానివహముతో నుద్యాన

వన విహారోద్యోగమున బయలువెడలెను. అచ్చట వారి జాతులు, పూవులఁగోయుచు, చివురులఁజిదుముచు, కోయిల కంఠముల ననుకరించుచు, మాలలుకట్టుచు నరపాలకునితోఁ బరిహాసములాడుచుఁ జాలసేపు విహరించి, యలసి, నిర్మలనీరంజా కరమున స్నానమొనరింప నుంకించిరి. రాజును వారి ననుక రించి యాసరోవరమున దిగెను. ఒండొరులపై నీరుచల్లు కొనుచు, నోలలాడుచు, పలువిధములగు క్రీడలఁ దేలుచుండిరి.

అంత సాతవాహనునకు తనకుఁ గడుఁగూర్చునదియు, నతి లోకసౌందర్యవతియు, నవయౌవనయు, సంస్కృత సాహిత్య విశారదయు నగు విష్ణుశక్తి కుమార్తె మొగమున నీటిములెడ తెగని మొగఁజిమ్ముచుండ, నాదెబ్బల కానుకుమారి యోర్వఁజాలక యతిదీనమున "రాజన్! మోదకైస్తాడయ" యని ప్రార్థించెను.

ప్రాకృతభాషయందు విశేష పాండిత్యముగల భూవల్ల భుఁడు సంస్కృతభాషా విశేషముల నెఱుఁగనివాఁడగుటచే "మోదకములఁ" (కుడుములు) దెప్పించి యామెను మోద సాఁగెను.

ఈ ప్రహసనమును గాంచి యచ్చటివారెల్లను ననేకవిధ ముల రాజును బరిహసించిరి. విద్యాతిశయముచే గర్వించిన విష్ణుశక్తికుమార్తె యందఱికంటె నెక్కుడుగా గేలిసేయుచు "ఓ పండితవర్యా! ఏమి మీ పాండిత్యము? మోదకములఁ దెప్పించి మోదుచున్నారు? స్థలము, కాలమునైన గుర్తింపరా? ఇట మోదకములప్రసక్తి యేల కలిగినది? ఔరా? "మా+ ఉదకైః=మోదకైః" అను పదవిభాగమైనఁ గావింపఁజాలని మీరఁట పండితులఁట! పండితులను, కవులను సత్కరింతు

రఁట! మీపైఁ గావ్యములల్లించుకొందురఁట! ఇది వింతకాదా! మీరెట్లు పాండిత్యతారతమ్యము నిర్ణయింపఁగలుగుదురో? కవితారసము నెట్లు గ్రహింతురో?" యని యనేకవిధములఁ బలికెను.

రాణి పరిహాసముకంటెను, సపండితుఁడగు నాతనికి, ఆ వాక్యములభావము ములుకులవలె నాఁటగా, సిగ్గును, గోపమును, పెనఁగొన, బోనులోఁబడిన కొదమసింగమువలె, మంత్రముచేఁ గట్టువడిన మహానాగమువలె, రోజుచు నేమియుఁ దోఁపక, నెవ్వరితోడను మాటలాడక, చింతాసాగరమునఁ దోఁగుచు, తన సౌధమునకేగి యట్లో చేరి, యమాత్యులకు సైతము దర్శనమీయకుండెను. అతని యీ విపరీతచేష్టలకు, అంతఃపురిమందలి యెల్లరును విచారమున, నాశ్చర్యమున మునిఁగి యేమొనర్చుటకుఁ బాలుపోకయుండిరి.

నేను, బుద్ధియందు బృహస్పతిని మించిన శర్వవర్మయుఁ గలిసి, ప్రభుని విచారకారణ మరసి, పోఁగొట్టుటకుఁ దలంచి, ద్వారపాలకులను సరిచేసికొని, యంతఃపురంబు ప్రవేశించితిమి. అచట నిరంతరవేదనచేఁ జిక్కి కృశించి, తెల్లబాఱిన దేహముఁగలవాఁడగు నారాజును జూచి, సముచితవాక్యముల నిట్లు మనవిచేసితిమి.

"ఓ రాజన్యాగ్రణీ! మీరిట్లు కృశించిపోవుటకుఁ గారణ మేమి? మీరాజ్యమున పలుమూలల ధర్మము నాలుగుపాదములఁ జక్కఁగా నిర్వహింపఁబడుచున్నది కదా! మీ సామంతులందఱు దాసానుదాసులై కప్పము లేఁటేఁటఁ దప్పక కట్టుచున్నారుకదా! పౌరులు మీ ధర్మపరిపాలనమును వేనోళ్లఁ బొగడుచున్నారు. పండితులు కవులు మీ వితరణఁ గని

కార్యము లల్లుచున్నారు. మీ కేమిటఁగొఱఁత? మీ కొఱకు కొఱఁతఁ గలిగించి బ్రతికిపోవు జనుఁ డీజగమున నున్నాఁడా? మీయాజ్ఞ నేధూర్తుఁడేని తిరస్కరించెనా? వానిని వచింపుఁడు. వాఁడిప్పుడే మడిసినవాఁడగును. ఏ కుమారుఁడైనఁ దండ్రి యానతి మీఱెనా? ఏ వీరుఁడైన రణరంగమున వెనుదీసెనా? కులకాంతలు పతివ్రతలై మెలంగరా? ఏ మదవతియైనను నున్నదం బునఁ దనభర్త నెదురాడి విజృంభించెనా? ప్రభువరా! మీ తాపమునకుఁ గతమేమి? మీ యాజ్ఞలకుఁ బద్ధులమై యెల్లప్పుడు మీ క్షేమమే కోరుచు సర్వస్వము మీకయి యర్పించియుండు మాకేల మీ విచారకారణము తెలుపరు? మా ప్రజ్ఞావిభ వముచే నెట్టి విషాదఘట్టమునైనను, స్వర్గతుల్యముగఁ జేయమా? ప్రభూ! మాయెడఁ బ్రీతులరై మీ దుఃఖహేతు వెఱిఁగింపుఁడు. మీ మంత్రులపై మీకు నమ్మకములేదా? ఆజ్ఞాపింపుఁడు. మీ యాజ్ఞాబద్ధులసేనల నంగీకరింపుఁ" డని ప్రార్థింప, నాయవనీ పతివతంసుఁ డించుక సంతృప్త హృదయుఁడై లేచికూర్చుండి యిట్లనియెను.

"ఓ ప్రజ్ఞాధురంధరులారా! మంత్రులారా! మీకకారణమ నాయందుండు వాత్సల్యగౌరవాతిరేకమున నిట్లోదార్చితిరి. మీకీలోకమునఁ జేయరానికార్య మొకటికలదా? మిముఁబోటి మంత్రివరేణ్యు లేరాజునకుఁ గల రారాజే ధన్యుఁడు. వివేక వంతుఁడు, శూరుఁడు. అతనికి సాధింపరాని కార్యము లీజగమున లేవు. మీ నీతివిశేషమునఁగదా నేరాజ్యపాలనము గావించు చున్నాఁడను. కాలదేశములెఱిఁగి సామాద్యుపాయములఁ బ్రయోగించి కార్యములసాధించు మీయట్టి మనీషాధురంధ రులు నాయండనుండ నాకొఱఁతలు తీరినట్లే. ఇఁక విచార

హేతువును వినుఁడు. అయ్యది మానవాధీనముకాదు. ఏ భగవంతుఁడేని సాక్షాత్కరించి, వరమొసఁగవలసినదే. అయి నను మీకు వినుటవలన బోసఁగేమి? వినుఁడు. విస్తార సామ్రాజ్య ధురంధరుఁడనయ్యు విద్యాపాటవములేమి నా మనస్సునకెంతయు కష్టము కలుగుచున్నది. దశదిశాపరి వ్యాప్తమైన కీర్తియుతుఁడగు సాతవాహనచక్రవర్తి యపరిపక్వ హృదయుఁడు, విద్యాశూన్యుఁడు, మూఢుఁడు. కావ్యరసాను భూతి నందలేఁడు. ఎందఱు కవిపుంగవులు నాకంకితముగ సంస్కృత కావ్యములల్లరు? ఎందఱు పండితవరేణ్యులు నా మీఁది గీతముల వ్యాఖ్యానించి, నా కీర్తికాంతకు సొమ్ములలంక రింపరు? ఎందఱు యాచకులు నా యీవిం గొనియాడుచు నూరూరఁదిరుగరు? అయిననేమి? నేనట్టి పొగడ్తలకుఁ దగిన వాఁడనా? నా హృదయము విద్యాశూన్యముగాదా! ఇట్టి మూర్ఖుఁడగు రాజును సేవించుట మీవంటి మంత్రిసత్తములకును నపకీర్తిదాయకముకదా? ఈ విచారము మానుటెట్లు? నాకెట్లు విద్య యబ్బును? మనీషులారా? మీకు చేయరానిదేది కలదు? నాయీకోర్కె తీర్పలేరా? యోచింపుఁ"డని తన హృదయా వేదనను విశదీకరించెను.

ప్రబల వీరాధివీరుండగు సాతవాహనరాణ్మౌళి యిట్టి దీనాలాపముల నాడ, నాకును శర్వవర్మకును హృదయము కరఁగి పోఁగా నేమి ప్రత్యుత్తరమిచ్చుటకును బాలుపోక, యించుక యూరకుంటిమి. అంత నేనిట్లంటిని. "మహాప్రభూ! మీకోరిక యుత్తమమే! కాని కఠినమైనది. ఒక్క వ్యాకరణశాస్త్రమే పూర్ణ ముగా నభ్యసించుటకుఁ బండ్రెండు సంవత్సరములు పట్టును. అయినను నా సామర్థ్యమును వినియోగించి, ప్రభువులవారి

కాఱు సంవత్సరములలో బోధింతును" అని నేఁజెప్పియుఁ జెప్పక మునుపే శర్వవర్మ యించుక హేళనాపరముగ నిట్లనెను.

"ఓయీ పండితుఁడా! నీవాక్యములెంత సమంజసములు? వయసుమీఱినది. సకలభోగముల ననుభవించుచు, సుకుమారుఁడైన ప్రభువు గురుకులవాస శ్రమల కోర్చునియా నీతలంపు? ఆతని యాశ తీరుటెన్నఁడు? త్వరలో విద్య వచ్చు నుపాయమాలోచింపవలయును గాని, యిట్టి యనువుగాని మాటల వలనఁ బ్రయోజనమేమి?"

నేను:—శర్వవర్మా! పండితుఁడవు. సర్వమెఱిఁగినవాఁడవు. విద్య యొక్కనాఁటితో వచ్చునదియా? లేక ప్రభువులవారితోఁ బరియాచకములా?

శర్వ:—ఆహా! ఏమిమాటలు పలికితివి? ప్రభువులతోఁ బరియాచకమాడి బ్రతుకఁ గనువాఁడున్నాఁడా? నిశ్చయముగాఁ బలుకుచున్నాను. నేనాఱుమాసములలో సర్వవిద్యా పరిపూర్ణునిఁగా నొనర్తును. ఏమందువు?

నేను:—ఏమందును? అది యసంభవమని యందును. అదియే సంభవమయ్యెనేని, వేయేల?—వ్యవహారమున నుండు సంస్కృతప్రాకృత దేశభాషల వీడి యరణ్యములదారుల నాశ్రయించెదను. ఇదియే నా ప్రతిజ్ఞ.

శర్వ:—పండితుఁడా! ఎంత ప్రతిజ్ఞచేసితివి? నేనట్టి యసత్య వాక్యములాడను. ప్రభువులవారి కాఱుమాసములలో విద్య నేర్పనేని నీదాసుఁడనై నాసర్వస్వము నీకర్పించి, నీ పాదసేవలు చేయుచుందును. ఇదియు నాప్రతిజ్ఞ.

మేమిట్లాడు ప్రతిజ్ఞల వినుచున్న శాతవాహన ప్రభు వరుఁడు, తనకోర్కె మెచ్చిన నీడేఱునని సంతసించి మాయిరువు రకు బహుమానము లర్పించి వీడుకొల్పెను.

## ౪

ఇంటికి వెడలిన శర్వవర్మ యసాధ్యమైన తన ప్రతిజ్ఞను దలఁచి మనసునందు మిక్కిలి కలఁత నొందినవాఁడై, నిద్రాహార ములు మాని యే దారియుఁ దొరకక చింతతో నుండఁగా నాతని భార్య, పతివ్రతాశిరోమణి యతనినిజూచి, "ఆర్యా! ఏల మీరిట్లు చింతతో మ్రగ్గుచున్నారు? ఆహారనిద్రలు మాని నంతనే మీరొనర్చిన ప్రతిజ్ఞ నెఱవేఱునా? నా పలుకులు వినుఁడు. మన యారాధ్య దైవతమగు శ్రీకుమారస్వామిని ధ్యానింపుఁడు. భక్తజనాభీష్టములను నెఱవేర్చు నా భగవంతుని యనుగ్రహ మున మీ కోరిక నెఱవేఱఁగలదు" అనఁగా నాతఁడు మేల్కొనినవానివలె, వెంటనే లేచి, యాత్రిసతినిఁ బొగడి, స్నానసంధ్యావిధియు భోజనము నొనరించి, కుమారస్వామిని గూర్చి తపమాచరింపఁ బయనమాయెను.

తపోనియతుఁడై యాతఁడు వింధ్యారణ్యములకు నిరా హారుఁడై యరుగుచు, కృశించి, శోషిల్లి, మార్గమధ్యమున మూర్ఛితుఁడు కాఁగా శూలహస్తుఁడగు నొక పురుషుఁడు లేవఁదీసి "నాయనా నీకోరిక సిద్ధించు" ననుటయు, నా వాక్య ములే యమృతప్రాయము కాఁగా, శర్వవర్మ యాకలి దప్పులు లేక నిశ్చింతుఁడై కొన్ని దినముల ప్రయాణములలో దేవుని సన్నిధిని జేరెను. అచ్చట స్నానమాచరించి, పూజాద్రవ్య ములఁ గొని, భక్తులకల్పవృక్షమగు నా స్వామిని దర్శింప

దేశములోనికిఁ బ్రవేశింప, నందలి భగవానుఁడు ప్రత్యక్షమై యాతనికి "సిద్ధోవర్ణసమామ్నాయః" యను ప్రథమ సూత్రము నుచ్చరింపఁగనే తొందరపడి శర్వవర్మ రెండవ సూత్రము నుచ్చరించెను. దేవుఁ డంత "నోరీ! రెండవ సూత్రము నీవు పలుకకున్నచో, నీయది పాణినీయము నణఁచి వైచి యుండును. కాని, యిది యిప్పుడు స్వల్పతంత్రమై "కాతంత్ర" మనియు, నా వాహనమగు నెమిలిపేర 'కాలాప' మనియు వ్యవహరింపఁబడును. మఱియు, నీ రాజు పూర్వ జన్మమున నొక మునికుమారుఁడు. కులపతియగు భరద్వాజుని శిష్యుఁడు. మహాతపస్వి యగు నాతని కప్పుడు కృష్ణుఁడని నామము. అతఁ డొకనాఁటి సాయంకాలము విహరించు చుండఁగా నొక మునికన్యక కానిపించెను. సహజ సౌందర్య ములగు నామె దృష్టులచే నాకర్షింపఁబడిన వాఁడాయెను. అతఁ డంత నిలుపక యామెను సమీపించి, తన కోరిక తెలుపఁగా నామె యంగీకరించెను. ఈ వృత్తాంత మచటి మునులకుఁ దెలిసి వారిని శపించిరి. ఆ శాపఫలమే యిప్పుడు మానవులయి యిట్లు జనించిరి. ఆ కృష్ణుఁడే సాతవాహనుఁడు. ఆ ముని పుత్రికయే యాతనిఁ బరిహాసమాడిన విష్ణుశక్తి కూఁతురు. ఇఁక నీవేగుము. నిన్నుఁ జూడఁగనే నీ రాజు నా యనుగ్రహ మున, నీ యిచ్చచేత సకల విద్యలను గ్రహింపఁగలఁడు. అతఁడు మహాత్ముఁడగుటచే క్లేశములు లేకయే పూర్వజన్మార్జిత మగు సర్వవిద్యలు నేర్చుకొనఁగలఁడు" అని పలికి యంత ర్ధానమాయెను.

తరువాత శర్వవర్మ స్వామి కటాక్షము తనపైఁ బ్రస రించి తన యభీష్టము నెఱవేఱినందున సంతసించి యింటికి

బయలు దేరెను. అచటి పూజారు లాతని గౌరవించి, వచ్చునప్పుడు వాడుకొనుటకయి కొంత బియ్యమిచ్చిరి. దానినాతఁడు దారిలో వంటచేసి భుజించుచుండెను. అదేమి చిత్రమోగాని, యా బియ్యమెంత వాడినను తరుగదాయెను.

శర్వవర్మ పట్టణప్రవేశ మొనరించెను. అతనిరాక కశేష ప్రజలు సంతసము వెల్లడించిరి. పట్టణములో నెల్లరు పండుగలు చేసిరి. నాకుమాత్రము సంతోషము తగ్గిపోయెను. నా దుఃఖ మెవరితోఁ జెప్పుకొందును? ఆ వెనుక నొక శుభ ముహూర్తమున రాజునకు విద్యాభ్యాసముగావించెను. తలఁపు మాత్రముననె ప్రభుఁడు సర్వవిద్యల గ్రహించెను. నేను నా ప్రతిజ్ఞఁ దలంచి మిక్కిలి విచారించితిని.

సాతవాహన చక్రవర్తి సకలవిద్యాపారంగతుఁడగుటకుఁ బ్రజలెల్లరు సంతసించిరి. అప్పుడే యొక విద్వాంసుఁ డచ్చటికి వచ్చి యొక శ్లోకమును జదువఁగా, దానిని రాజు చక్కఁగా సంస్కృతమున వివరించి యర్థము చెప్పెను. అచ్చటి వారందఱు సంతోషాశ్చర్యములు పొందిరి. నృపాలుఁడు తన కింత యుపకార మొనరించిన శర్వవర్మను సకల భూషణాంబరములఁ బహూకరించి, ఇంతకు మూలకారణ మయిన విష్ణు శక్తి కూఁతును బట్టమహిషిగా నొనర్చెను.

అంత నేను మానమును బూనితిని; గాన రాజకార్యములు చేయ వీలుపడకుండుటచే సైఁగలచేతనే రాజు వీడ్కోలు వడసి, యతఁడిష్టపడకున్నను, నిరువురు శిష్యులతో వింధ్యవాసినిని సమీపించితిని. దేవి యొకనాఁడు కలలోఁ గానిపించి, నీయొద్దకుఁ బొమ్మని యాజ్ఞాపించెను. ప్రయాణము లొనరించి వచ్చి యిచ్చటి పిశాచములు మాటలాడుభాష దూరము

నుండియే విని గ్రహించి నేర్చుకొంటిని. ఈ భాష రాఁగా, మాఱుము మానితిని. నీ రాకకయి ప్రతీక్షించుచుంటిని."

అనఁగానే కాణభూతి "మహాత్మా! నా శాప విమోచన కాలము సమీపించినది. ఆ విషయ మెఱుయుటకే నే నుజ్జయినీ నగరమున కరిగియుంటిని. అక్కడ నాహితుఁడగు భూతివర్మను విచారింపఁగా, నీవిచ్చటికి వచ్చియున్నావని యెఱుక పఱచెను. అంత నీ యాగమనమును బ్రతీక్షించుట కిచ్చటి కరుగుదెంచి, నిన్నుఁ గంటిని. చాల సంతసించితిని. నీవలన నీ మానవజన్మ కథను వింటిని. ఇఁక వరరుచిపండితుఁ డిచ్చిన మహాకథను జెప్పినంత నా యీశరీరము పతనమగును. కావున నింతలో నిన్నొక్కటి యర్థించుచున్నాను. దయచేసి తెలుపవలయునని ప్రార్థనము. ఏమనఁగా, పుష్పదంతుఁడని వరరుచికిని, మాల్యవంతుఁడని నీకును పేళ్లు రాఁగతమేమి? వివరింపుము." అనఁగా గుణాఢ్యుఁడు సంతసమున, "నోయీ! దానికింత ప్రార్థింపవలయునా? తప్పక చెప్పెద నాలకింపుము" అని యిట్లనెను.

౫

సకల కల్మషములఁ గడిగివేయు గంగానదీ తీరమున బహు సువర్ణకమను నగ్రహారము కలదు. అది యెల్లప్పుడు వేదనాదములచేఁ బవిత్రమై వెలయుచుండును. అందు వేదాధ్యయన సంపన్నుఁడగు బ్రాహ్మణుఁడు గలఁడు. అతనిభార్య యగ్నిదత్త యనునది. ఇరువురును నైష్ఠికులు. ధర్మచింత గలవారు. అతిథులను నభ్యాగతులను బూజించువారు. సత్కార్యములనే యాచరించువారు. వారి కిద్దఱు కుమారులు గలరు.

తలిదండ్రులకును బుత్రులకును విద్యాగుణములయందు హస్తిమశకాంతరము కలదు. మూఘలును, మూర్ఖులును, గర్వితులు నగు నా పుత్రులనుగూర్చి గోవిందశర్మ విచారింపని దినములేదు. అగ్రహారమందలి బ్రాహ్మణులెల్లరు గోవిందశర్మ మీఁది గౌరవముచే వీరిని సత్కరించుచుండిరి. అంతమాత్రమునసే వారికిఁ గన్నులు నెత్తికెక్కి యెట్టివారినిగాని లక్ష్య పెట్టకుండిరి.

ఇట్లుండఁ గొన్నాళ్లకొకయతిథి వైశ్వానరునితో సమానుఁడు, వైశ్వానరుఁడను పేరుగల బ్రాహ్మణుఁడు వారి యింటి కాతిథ్యమునకయి వచ్చెను. ఆతఁడీ మూర్ఖపుత్రులను జూచి పండితులని తలఁచి, వారికి నమస్కరించెను. కాని యా మూర్ఖులు గర్వముచే నాబ్రాహ్మణుని సత్కరించి స్వాగతములు పలుకక యెగతాళి చేసిరి. వారి యాగర్వపాలు చూచి, వైశ్వానరుఁడు కనలి వెడలిపోనుండ, గోవిందశర్మ సమీపించి, "బ్రాహ్మణవర్యా! ఏల యాగ్రహించి వెడలుచున్నారు? నా యాతిథ్యము స్వీకరింపుఁడని వేఁడుకొనఁగా, నాతఁ "డయ్యా! నీ కుమారులవంటి మూర్ఖు లీ లోకమునలేరు. అట్టి వీరుండు నింట నాతిథ్యముగొన్న నేను ప్రాయశ్చిత్తము చేసికొనవలెను. కావున నిర్బంధింపకు" మనఁగా గోవిందశర్మ "యార్యా! యీ నా మూర్ఖులగు పుత్రులను నేఁటితోడ విడిచితిని. వీరికి నాకు నేలాటి సంబంధమును లేదు. వీరిని నేను తాఁకనైనఁ దాఁకను. తాము దయచేసి నేఁ డాతిథ్యము స్వీకరింపవలయు" నని వేఁడెను. అతని భార్య యగ్నిదత్తయు నట్లు తన్నుఁ బ్రార్థీయపడఁగా వైశ్వానరుఁ డాయింట నాఁ డాతిథ్యమును గొనెను.

ఇట్లు తండ్రిచేఁ ద్యజింపఁబడిన కొమరులలో నొకఁడు దేవదత్తుఁ డనువాఁడు తన యకార్యమునకుఁ బశ్చాత్తప్తుఁడయి దేశాంతర మరిగెను. అట్లాతఁడు బదరికాశ్రమమున కేఁగి సాంబమూర్తినిగూర్చి తపమాచరించెను. అతని ఘోరతపమునకు మెచ్చి సాంబమూర్తి ప్రత్యక్షమై "వత్సా! నీకేమి కావలయు" నని యడుగ నాతఁడు "దేవా! నీ సమీప వర్తనము నాయిష్ట" మనఁ దేవుండును "నీవు సకల విద్యలను నేర్చి పండితుఁడవై సకల రాజభోగముల ననుభవించి, కడకు నా చెంతకు వత్తు" వని వరము నొసఁగెను. దేవదత్తుఁడు పిమ్మట ప్రతిష్ఠాన నగరమున కేఁగి, మంత్రస్వామి యను నుపాధ్యాయు నాశ్రయించి, యాతనిచే సకల విద్యలను గ్రహించెను.

ఒకనాఁ డాతఁడు వాహ్యాళి వెడలుచుండ రాజప్రాసాదమునుండి "శ్రీ" యను రాజకన్య సకల విద్యల నేర్చినవాఁడును, సర్వాంగసుందరుఁడు నగు నతనిని జూచి, మోహించెను. అతఁడును మెఱపునలెఁ బ్రకాశించు నామెను జూచి సమ్మోహితుఁడయి, కొంతసేపు కదలకుండెను. ఈయను వెంటఁగి యా తరుణీమణి యాతనికి సైఁగఁ జేసి, దగ్గఱకుఁ బిలిచి, యొక పుష్పమును దంతములతోఁ గొఱికెను. అది సరిగా నాతని పాదముల యెదుటఁబడెను. అతఁడా పూవును గొని, యింటికరుదెంచి, యామె సైఁగల భావము తెలియఁగఁ జాలక మిక్కిలి పరితాపపడుచుండెను.

అతని హృదయతాపమును గురువర్యుఁడు తెలిసికొని, "కుమారా! నీవేల తాపమందుచున్నావు? నా కెఱింగింపుము. నీ సందేహములన్నియుఁ దీర్తు" నన దేవదత్తుఁడు "గురుదేవా! తమ యెదుట నా హృదయమును బాధించుచున్న తాపమును

బయలు వెట్టుటకు సిగ్గేల? ఇచ్చట నాకు గురువైనను, తలిదండ్రు లైనను మీరే కదా! ఎట్టి విచారము కలిగినను దీర్చవలసిన స్వాతంత్ర్యము మీకున్నది గదా! నేడు రాజాంతఃపుర సమీపమున నేగుచుండఁగా సౌధముమీఁదినుండి యొక రాకుమారి నాయెదుటఁబడి నా మనస్సును హరించినది. ఆమె నన్నుఁజూచి మోహమున మునిఁగి, యేమి దెలుపుట కును వీలుకాదు గావున, లోనికేఁగి యొకపూవును గొని తెచ్చి, తన దంతములతో నెగఁజిమ్మివైచినది. అంత నే నాపూవును గొని వచ్చితిని. కాని యందలి రహస్యము నాకెఱుకపడ దయ్యెను. అందులకే యింత విచారి" మనఁగా గురుఁడు చిఱునవ్వు నవ్వి "ఇంతేనా! పిచ్చివాఁడా! యిది యొక గొప్ప రహస్యమా? ఈ పురబాహ్యమున నుండు దేవాలయమునకు రమ్మని నీకు సైఁగ చేసినది. ఆ దేవాలయమునందే కాలమున నైనను పూవులు విరివిగా పూయుచుండును. కనుక దానికి పుష్పదంతమని పేరు వచ్చినది. నీ వీనాఁ యుంకాల మా యాలయమునకుఁ బొమ్ము. రాకుమారి నిన్నుఁ గలయఁగలదు."

ఆ మాటలను సంతసించి, సాయంకాలమువఱ కెట్లో కాలము గడపి, గురుని యాదేశప్రకారము, నా వేల కరిగి లోన దాఁగియుండెను. రాకుమారి పూజ నెపమున గుడికరుదెంచి, తన చెలిమికత్తియల వెలుపలనుండ నియమించి లోనఁ బ్రవే శించి, తన వలపుకానిఁగని కౌఁగలించి "చెలికాఁడా! నా సైఁగ గ్రహించి వచ్చుటకి నాఁగలుగుదువో లేదో యని విచారించితిని" నన, నాతఁడు "అవును. నేను నీ వొనర్చిన సంజ్ఞార్థమును గ్రహింపఁజాలకుండఁగా నా గురువరుఁ డుపదేశించె"నని యున్న దున్నట్లు నుడివెను. ఆ మాటలకామె కినుకతో "ఛీ! ఛీ!

నన్ను వదలుము. నీవు జాణఁడవుగా" నని వదలించుకొని, తనగుట్టు బయలుపడునేమో యను భీతితోఁ జెలికత్తెలఁ బొంచరించుచు శీఘ్రముగాఁ బురమువైపునకు వెడలెను. దేవదత్తుఁడు చేతపడిన ఫలము మాయమైనట్లు హతాశుఁడై విచారించుచు పురమునకు మరలి యిలుసేరెను.

చింతాసాగరమున మునిఁగి యన్యమెఱుఁగక యున్న ప్రియశిష్యుఁడగు దేవశర్మను గురుఁ డనేక విధములఁ దేర్చినను లాభము లేకపోయెను. ఎప్పుడును రాకుమారినే మనమున ధ్యానించుచు నితరకార్యముల నాతఁడు మఱచెను. నిద్రా భోజనములు మానెను. దేహము కృశించెను. బలము తగ్గెను. కాని యతని కోరిక నెఱవేఱి వేదన తీరుమార్గము కాఁరాలేదు. కడ కాతఁడు విసిగి దేహత్యాగము సేయ నిశ్చయించి, తన గురువునకైనను దెలుపక, నడురేయి, యెల్లరు నిద్రాసౌఖ్యము ననుభవించుచుండఁ బట్టణమునుండి నిర్గమించి, సమీపమందలి యరణ్యమున కరిగి యచ్చట నురిపోసికొన నాయత్త పడుచుండెను.

ఆతని యిష్టదైవమగు శంభుఁ డిదియంతయు నెఱిఁగి, తా నాతనికిచ్చిన వరము వ్యర్థ మగునని తలఁచి, వానిని కాపాడుట కయి, తన ప్రియభక్తుఁడైన పంచశిఖుఁడను ప్రమథవరుని రావించి యెల్ల విషయములు బోధించి పంపెను.

పంచశిఖుఁడు ముసలి బ్రాహ్మణవేషము ధరించి. దేవదత్తుని సమీపించి, "ఓయీ! కుఱ్ఱవాఁడా! ఎందుల కిట్లాత్మహత్యకుఁ బ్రయత్నము లొనరించుచున్నావు? నీ తలిదండ్రులు దూషించి పలికిరా? నీ యవివేకమునకు నీ స్నేహితులు హేళన చేసిరా? లేక నీ యనురాగము నే జవరాలైనఁ దిరస్కరించి

నదా? చెప్పుము. ఏది నీ దుఃఖహేతువు? ఏదియైనను దీర్పఁ గలను" అని నుడువఁగా దేవదత్తుఁడు తన విషయమూ మూలము పూర్తిగాఁ దెలిపెను. అందులకా వృద్ధ బ్రాహ్మణ వేషధారియగు పంచశిఖుఁడు నవ్వి "ఇంతేకదా! నేఁ జక్క చేసెదను రా" మ్మని యాతనిఁ దోడ్కొనిపోయి, యొకచోటఁ దన మాయా ప్రభావముచే నాతని నొక రమణీయ స్త్రీ మూర్తిగాఁ జేసి, రాజునొద్దకుఁ దోడుకొని పోయెను.

నిండోలగమున నున్న రాజును వేదోక్తముగ దీవించి, "రాజన్య శేఖరా! కంటివికదా! యీ సుందరాంగి నాకోడలు. నా పుత్త్రుఁ డీమెను వీడి యెచ్చటికో యరిగినాఁడు. అతనిని వెదకుచు ననేక దేశములు తిరిగితిని. ఇంకను వెదుకవలసిన ప్రదేశములు గలవు. ఈమెను వెంటఁ గొనిపోవుట చాల ప్రమాదకరముగ నున్నది. ఈమె నెవరి రక్షణమున నుంచి పోవుదును? సత్యదయాధర్మాదార్ద్రగుణములు గలవాఁడ వీవొక్కఁడవే నా కగపడితివి. అట్టి నీకడ నీమె నిల్లుపయుంచి నెట్టి దోసంబును బొసఁగదని యెంచి వచ్చితిని. నాయందు దయఁగ, హించి, నా కుమారుని వెదకి తెచ్చునంతదనుక, నీమెను నీ కన్యాకాంతఃపురమున నుంచి కాపాడుదువని ప్రార్థించుచున్నాను" అనెను.

ఆ మాటల నాలించిన రాజు ధర్మమునకు, బ్రాహ్మణ శాపమునకు వెఱచి, యాతని యభ్యర్థనమునకు సమ్మతించి, యా సుందరాంగిని తన కుమార్తెయుండు కన్యాకాంతఃపురమున కనిపి, జాగ్రత్తగా కాపాడుచుండ నియమించెను. ముదుసలి బ్రాహ్మణుఁడు యథేచ్ఛం జనియెను.

అంతఃపురము ప్రవేశించిన సుందరాంగనారూపుఁడగు దేవదత్తుఁడు తన ప్రేయసి యగు శ్రీ దేవితో మిక్కిలి సఖ్యము వాటించి మెలఁగుచుఁ, గొంతకాలమున కామెకు రెండవ ప్రాణ మాయెను. ఎల్లప్పుడు ఒకరి నొకరు విడఁబాయక మెలఁగుచుండిరి. అన్యోన్య రహస్యము లెఱుకపఱచుకొనిరి. అట్లు తప్పని నామెకు నమ్మకము కలిగిన యనంతరము దేవదత్తుఁ డామెతోఁ దన నిజవృత్తాంత మెఱిఁగించి, తన మనోవేదనను దెలిపి యామె యనురాగమును గోరెను. అదియు మొదట నాతనియందుఁ దగులము గలది. కావున, నాతని యిష్టమున కంగీకరించెను. ఇరువురును గాంధర్వ విధిని బరిణయమైరి.

వారు ప్రేయసీప్రియులవలె నితరులకుఁ దెలియనీయక, కేవలము హితులవలెనే మెలఁగుచు, నారామములఁ విహరించుచు, జలకేళి సలుపుచు, ననేకవిధములఁ బ్రవర్తించుచుండిరి. ఇట్లు కొంతకాలమునకు శ్రీదేవి గర్భము ధరింపఁగా నుచితజ్ఞుఁడగు దేవదత్తుఁడు పంచశిఖుని దలంచె, యాతఁడు ప్రత్యక్షము కాఁగా, నాతని మాయచే నంతఃపురమును విడిపోయెను.

మఱునాఁడు రాజు కొలువున నుండఁగా స్త్రీవేషమును త్యజించిన దేవదత్తునిఁ గొని యా మాయాబ్రాహ్మణుఁడగు పంచశిఖుఁడు ప్రవేశించి, రాజును గాంచి, "ప్రభూ! ఇదిగో నా కుమారుఁడు. దొరికినాఁడు. ఇతనికొఱకే నేనిన్ని కష్టము లనుభవించితిని. భగవంతుఁడు నా కష్టములకు ఫలము నేకూర్చినాఁడు. ఇఁక సుఖపడఁగలను. నా కోడలిని బంపు"మనెను.

ఇల్లడయున్న నాతరుణి రాత్రియే యెక్కడికో వెడలినదని విన్నరాజు, బ్రాహ్మణుని యాగమనమును, నాతని

కోరికయు విని నిశ్చేతనుఁడై యేమియుఁ జాలుపోక తన మంత్రుల సహాయమునుఁ గోరెను.

మంత్రులీతఁడు సామాన్య విప్రుఁడు గాఁడనియు, నానాకారకల్పనులు దేవతలు, పరీక్షించుటకై యిట్టి వేషముల వచ్చుచుందురనియు, నిష్ఠుఁ డీతని నెట్లైనఁ దృప్తిపఱుపనిచో శాపమొసఁగఁగలఁడనియు రాజునకుఁ దెలియఁజెప్పిరి.

ఆ నృపుఁడు భయముతోఁ గాలుసేతులు వణఁకుచుండ "విప్రవర్యా! నన్ను క్షమింపుఁడు. నాకభయమిండు. బ్రాహ్మణులు శాంతిమూర్తులు కదా! నాయందోర్మి సహింపుఁడు. మేమెంత జాగ్రత్తతోఁ గాపాడుచుండినను, మీ కోడలు రాత్రి యెటకో దెలుపక పోయినది. ఎటుపోయినది గ్రహింపలేకున్నారము. నేను వేగులవారి నేనుల నంపి యెల్ల కడల నరయఁబంచితిని. కాని యామెజాడ కానవచ్చుట లేదు. మమ్మనుగ్రహింప వేఁడుచున్నా"నన, బ్రాహ్మణుఁడు కోపము నటించుచు, "ఓయీ!
ధర్మాత్ముఁడవని నమ్మి నీ కడ నిల్పినయెడ నీవిట్లు చేయుదువా? ఔరా! తెంపరితనము? బ్రాహ్మణ మాహాత్మ్యము నీవెఱుఁగవా? నన్ను మోసగింపఁ జూచుచున్నావా? బడుగు బ్రాహ్మణుఁడను. ముసలివాఁడను, పేదవాఁడను. ఇఁక నా కుమారున కెక్కడ నుండి పెండ్లిచేయుదును? ఒకవేళ చేసినను, నట్టి సౌందర్యవతియు, గుణవతియు నగు కన్య దొరకునా? ఇవి యేమి చేఁతలు?" అని తిరస్కరించుచు, శాప మొసఁగఁ బ్రయత్నించుచుండ మంత్రులడ్డమై "ద్విజోత్తమా! ఇది తగునా? అభయము గోరి వారిని శపింపఁ దలంతురా? ఇదియా బ్రాహ్మణ ధర్మము? మీ కుమారునికి వివాహమే యిష్టమైన, మా రాజ

పుత్రికను మీ కోడలింగాఁ గొనుఁడు. రూపగుణముల యందామె మీ పూర్వపుఁ గోడలికి తీసిపోదు. ప్రభువు నీ విషయమును మే మొప్పింతుమని సాంత్వన వాక్యములఁ బలికి, రాజు నొప్పించి యాతని కుమార్తె నీఁగా, దానిచే శాంతించిన వాఁడువోలె నటించి, పంచశిఖుఁడు రాజు కుమార్తెను దేవ దత్తున కప్పగించి, కైలాసమున కరిగెను.

దేవదత్తుఁడు తానుగోరిన కాంతను బొంది, సర్వ సౌఖ్యము లనుభవించుచు పుత్రులు లేని మామగారొసఁగిన రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడై పాలనము సాగించెను. కొంత కాలమున కాతని కైశ్వర్యములపై విసుగు జనించుటయు, రాజ్యపాలనార్హుఁడగు కుమారునికిఁ బట్టాభిషేకము గావించి, సతీసమేతుఁడై యరణ్యములకేఁగి యీశు నారాధించి, ప్రమథుఁడాయెను. అతని భార్య శ్రీదేవియు జయయను నామముతోఁ బార్వతి ప్రతీహారి యైనది.

ప్రియ దంతముతోఁ జన్మిన పుష్పసంజ్ఞ నెఱుంగలేక పోయినందున నాతనికిఁ బుష్పదంతుఁడను నామము సార్థక మాయెను.

౬

మిత్రమా! కాణభూతీ! దేవదత్తుని తండ్రియగు గోవింద శర్మ యుండెను కదా! అతని కుమారులలో నే నొకఁడను. దేవదత్తునివలెనే నాకును దలిదండ్రులపైనను గృహముపైనను మమత తొలఁగఁగా దేవదేవుఁడగు శంభు నారాధింప హిమ గిరి కరిగితిని. అచ్చట నా దేవుని నానావిధములగు కుసుమ మాల్యములచే నారాధించితిని. ఎవ్వరికి నెచ్చటను దొరకని

పూవులను సంపాదించి, పూజించు నా భక్తికి మెచ్చి శంకరుఁడు ప్రత్యక్షమై వరము కోరుమనఁగానే నైహికముల నేవగించి, గణత్వమును గోరితిని. దేవుఁ డది ప్రసాదించి యంతర్ధాన మాయెను.

మానవుల కసాధ్యమైన పుష్ప మాల్యముల సంపాదించి దేవు నారాధించుటచే నాకు మాల్యవంతుఁడను పేరు సార్థక మయ్యెను. ఆ దేవుఁడే యీ నామకరణ మొనరించెను. కాని మాతయగు పార్వతీదేవి శాపముచే మఱల మానుష దేహమునఁ బుట్టవలసి వచ్చినది. మిత్రుఁడా! ఇఁక హరప్రోక్తమై పుష్పదంతునినుండి నీవు పొందిన యా కథను నాకు వినిపింపవయ్యా! నీకును నాకును నయ్యదియేకదా శుభము లను గూర్చునది.

అట్లడిగిన గుణాఢ్యునకుఁ గాణభూతి వినయముతో నమస్కరించి, "యార్యా! తమ యవ్యాజ కరుణా కటాక్ష ముచే నెల్ల విషయముల గ్రహించినాఁడను. మన కిరువురికి శాపవిమోచనము కలిగించు నా కథను వినుఁ" డని తన భాష యగు పైశాచిలోనే యేడు కథలుగా వినిపించెను. మనో హ్లాదకరమైన యా కథను గుణాఢ్య పండితుఁడు తక్కిన భాషల విడిచినవాఁడగుట పైశాచిలోనే రచించెను. ఒక్కొక్క కథయు నొక లక్ష గ్రంథముగా నేడింటిని నేడులక్షల గ్రంథ ముగా రచించెను. పరవిద్యాహారులగు విద్యాధరులు హరింప కుండుటకు, నడవినడుమ సిరా దొరకనందునను నాతఁడద్దానిని తన రక్తముతో వ్రాసెను.

అట్లు రచించిన యా గ్రంథమును బూర్తిగాఁ గాణభూతికి వినిపించెను. అతఁడు పఠించునప్పుడు, అందలి కథాచమ

త్కారమును, రసవిశేషము నాస్వాదించుటకు దేవతా సమూహము తమ విమానముల నధిష్ఠించి, యాకాశ మార్గమున నిలిచియుండెను. గుణాఢ్యుఁడు రచించిన యా కథను విని కాణభూతి తన శాపము నశింపఁగా నాతని వీడ్కోలు వడసి వెడలిపోయి తన పూర్వ పదవిని బొందెను. అతనితోడి పిశాచములును కథాశ్రవణ గౌరవముచే దివ్యగతి నందినవి.

అంత గుణాఢ్య పండితుఁడు తాను రచించిన గ్రంథ రాజమును భూమిలో స్థాపింపఁదలంచి యందులకు దగినవాఁ డెవఁడా యని యాలోచించుచుండెను. అట్లున్నను, సంస్కృత ప్రాకృత దేశ భాషలఁ ద్యజించి పైశాచిలో నుండుటచే నెవ్వ రాదరింతురని నిరంతరగ మస్వస్థ్యభావమునకులోనై చింతించుచుండ నాతనితో నరుదెంచిన గుణదేవ నందిదేవులను శిష్యద్వయ మాతని విచారమునకుఁ గారణమారసి, చేరఁబోయి, "గురు వర్యా! మీ రిట్లు విచారింపఁ బనియేమి? మిమ్ముఁ బోషించిన వాఁడును, సరససద్గుణ గరిష్ఠుఁడును, రసికుఁడును, సకల భాషా కోవిదుఁడు నగు సాతవాహన సార్వభౌముఁడు మీ గ్రంథము నంగీకరింపఁడా? ఆతఁ డంతటి కృతఘ్నుఁ డగునా? రఁడు, నేఁడే యాతని పాలి కరుగుఁడు" మని ప్రబోధింప నించుక తెలివి నొంది, శిష్యుల యాలోచనమేరకు ప్రతిష్ఠానమున కేఁగెను. అచ్చట గుణాఢ్యుఁడు పట్టణమునకుఁ బోయిన ప్రతిజ్ఞాభంగ మగునని తలంచి, సమీపమందలి యుద్యానవనములోని కాళికాలయ మున నుండి శిష్యులచే గ్రంథమును రాజునొద్దకుఁ బంపెను.

వారు దానిని గొని పట్టణమునఁ బ్రవేశించి, రాజవీథుల దాఁటి, మంత్రి సామంత దండనాథ పురోహితులచేఁ బరివేష్టితుఁ

డగు సాతవాహన సార్వభౌమునిఁ గాంచి యాశీర్వదించి నిలిచిరి.

వేషభాషలయందుఁ బిశాచములవలె నున్న యీ యిరువురిని దిలకించి సభయంతయు నాశ్చర్యపడుచుండ రాజు వారితో "అయ్యా! మీర లెవ్వరు? ఏ కార్యమును గోరి యిట కరుగుదెంచితిరి?" అని ప్రశ్నించెను.

వారు వినయవినమితులై తమ యాగమన కార్యము నివేదించిరి. ఆ రాజు విద్యామదముచేఁ దనహితుఁడు రచించినది యనియైనఁ దలంపక, యిట్లనెను "మీరు పిశాచ రూపులు, గ్రంథము పైశాచి, నీరస భాష; వ్రాసినది రక్తముతో; నిఁకఁ బరిమితియా లేదు లక్షలు! ఛీ! ఛీ! ఏమి వాడు కథ! దీని నర్పించుట కింకెవ్వరు దొరకలేదా?" యని యుపహసించెను.

ఈ మాటలు విని శిష్యులు తమ సంరంభమంతయు వ్యర్థ కాఁగా, విచార వదనములతోఁ గ్రుమ్మరిల్లుచు, తమ గురువగు గుణాఢ్యునొద్దకుఁ బోయి సర్వము వినిపించిరి. ఆ మాటలు విని గుణాఢ్యుఁడు తన మనమున నిట్లు చింతించెను. "అక్కటా! ప్రాణసమానముగా గౌరవించిన భూపాలుఁ డిట్లవమానము చేయునా? ఇంతకంటె వేఱు దుఃఖము కలదా? ఇంక నేనని నాశ్రయింతును? ఆశ్రయించినను ఫలమేమి? నా శాపవిముక్తికి భూలోకమున దీని ప్రచారమే కదా ప్రధానము? అయ్యది యెట్టులైన నేమి" యని కొంత యాలోచన సల్పఁగా గుణాఢ్యుఁడు సమీపమందలి యరణ్యమునకుఁ బోయి, యచ్చటఁ గల యొక పర్వతముపై నేకాంతముగాఁ గూరుచుండి, యొక కుండమున నగ్నిం బ్రజ్వలింపఁజేసి, శిష్యులు వినుచుండ

నొక్కొక్క యామునఁ గల శ్లోకముల శాస్త్ర్యముగాఁ జదివి తానా యగ్నికాహుతి సేయుచుండెను.

అతఁ డా ప్రకారము కథను జదువుచుండ నా ప్రాంతముల నుండు సింహములు, మహిషములు, మత్తేభములు, సారంగములు మున్నగు జంతు సమూహములు కథాసారము గ్రహించుట కట మూఁగి, బారులుతీరి నిలుచుండి, నిద్రాహారముల నైనను గ్రహింపక, నిశ్శబ్దముగ వినుచు నానంద బాష్పముల రాల్చుచుండెను. ఆకసమునఁ బాఱు పక్షు లచ్చట మఱియొక ప్రక్కఁ దమ కలకల నాదములు విడిచి వినుచుండెను.

ఇట్లుండ సాలివాహన చక్రవర్తి కనారోగ్యము కలిగెను. వైద్యులు పరీక్షించిరి. నీరస మాంసభోజన మందులకుఁ గారణమని నుడివిరి. రాజును మంత్రులును, పాకశాలాధికారిని బిలిచి విచారింపఁగా, వారు తమ కేమియుఁ దెలియ దనియు, వేటగాండ్రు ట్టి మాంసమునే యిచ్చుచున్నారనియుఁ దెలిపిరి. వేటగాండ్ర నా విషయమై సంప్రదించి యడుగఁగా వారు భయభక్తులతో "మహాప్రభూ! ఇందు మా దోసము లేదు. మా కట్టి మృగములే దొరకుచున్నవి. అవి యన్నియు యత్నలబ్ధములు. ఆ యడవిలో నొక ప్రశస్తమైన గ్రంథము నొకదానిని పఠించుచుఁ, జదివిన యంశము హోమకుండమున వేయుచున్నాఁడు. దానికి

లన్నియు నిశ్శబ్దముగా నాతని చుట్టును నిద్రాహారములు మాని నిలుచున్నవి. అవి యెప్పుడు నా చోటు విడిచిపోవున ట్లగపడవు. అట్టివాని మాంసము నీరసము గాక యెట్లుండును?" అని విన్నవింపఁగా, రాజాశ్చర్య మానసుఁడై యాతి

నిని జూచు కుతూహలమున, వేటగాండ్రు దారి సూప బయలుదేరెను.

ఆ యరణ్యమున జడల సమూహముచేత నిండిన దేహము కలవాఁడైన గుణాఢ్యుని గురించి, రాజచంద్రుఁడు నమస్కరించి, యతని వృత్తాంత మడుగఁగా నాతఁడు పుష్పదంతుని వృత్తాంతముఁ, దన సమాచారమును వినిపించెను.

రాజాతఁడు ప్రమథావతారుఁడని తెలిసికొని, యతని పాదములకు మ్రొక్కి, "మహాశయా! మొదట విద్యామదమున, నీ గ్రంథమును నిరసించితిని. క్షమింపుము. ఇప్పుడా గ్రంథమును దయచేయు" మని వేఁడఁగా, గుణాఢ్యుఁడు "రాజా! ఇప్పటి కాఱులక్షల గ్రంథము—ఆఱుకథలు గలది యగ్ని దేవున కర్పించితిని. ఇఁక మిగిలియున్నది యేడవ కథ. ఇది యొకలక్ష గ్రంథము. నరవాహనదత్త చరిత్రము. దీనిని బృహత్కథ యనియు నందురు. దీనిని గొనుము. నీతోడ నా శిష్యులు వచ్చి వివరింతురు" అని యొసఁగి శిష్యుల తోడను గ్రంథముతోడను వీడ్కొలిపి యోగముచే దేహము వీడి శాప విముక్తుఁడై దివ్యపదముఁ జెందెను.

శాతవాహనుఁ డా గ్రంథమును గొనివచ్చి, గుణాఢ్య శిష్యులగు నందిదేవ గుణదేవులను సత్కరించి, కథావతరణ మగు నీ వృత్తాంతము నా పైశాచిలోనే రచియింపించి ముందుఁ జేర్పించి వారి ననేక విధముల బహూకరించి యంపెను.

## శాపకారణములు

శ్రీమంతంబైన భారత భూమికి నుత్తరదిగ్భాగమునఁ, బూర్వాపరసముద్రములకుఁ గొలగఱ్ఱవలె హిమాలయపర్వ

తము వెలయుచుండెను. అది తన యౌన్నత్యముచేతనే గాక, సర్వౌషధీసంపన్నముచేతను నగాధిరాజత్వమును స్థాపించుకొనెను. ఆ పర్వతము లోయలయందు సిద్ధ విద్యాధర కిన్నర కింపురుషులు తమ యంగనలతో నెల్లప్పుడును విహరించుచుందురు. అచట నచట నాశ్రమములఁ గల్పించుకొని మునులసమూహము తపోధ్యాననియతిమై యనంత మోక్ష సామ్రాజ్య సౌఖ్యముల నాకాంక్షించుచుండును.

మహోన్నతములైన యీ గిరిశృంగములలో నిరంతరము పరమేశ్వర నివాసమగుటచే వాసిఁగాంచినది కైలాస శిఖరము. ఆ శిఖరప్రదేశములలో శివుఁడు పార్వతితోఁ క్రీడించుచుండును. ఒండొరుల నెడఁబాయని యీ జగత్పితరులు పార్వతీపరమేశ్వరులు, తమకు ప్రమథగణములు సేవ లొనర్పఁగ, సెలయేటి వాలుతిన్నెలందును, సుద్యానవనములందును, చంద్రకాంతవేదికలయందును, పూఁదేనియ కాలువల సమూహములందును, పూఁబొదరిండ్లయందును, విహరించుచుందురు.

తన సేవకులగు ప్రమథులలో నాతనికిఁ గూర్చువాఁడు పుష్పదంతుఁడు. పూర్వజన్మ తపఃఫలముచేతనో, మఱి యేకారణముననో, యేకాంతమందున్నప్పుడు సైతము, అతని రాకపోకలకు పార్వతీ శివు లనుమతించుచుందురు. ఆతనికిఁ గలిగిన గౌరవము నారసి యితర ప్రమథు లాతనియెడ మిక్కిలి మన్ననతోఁ బ్రవర్తింతురు. అతని భార్య జయ యనునది పార్వతి యనుగ్రహము వడసి, యామె పరిసరవర్తినియై చరించుచుండును.

ఒకనాఁ డంతఃపురమున నేకాంతమున నుండు భర్తచెంతఁ జేరి పార్వతి యనురాగమున సరససల్లాపములాడుచు, సందర్భవశమున నిట్లనెను. "నాథా! మీరు నాపయిఁ బ్రేమచూపుచున్నట్లే యుందురు. కాని మీ హృదయ మన్యాయత్తము. ఒకతె నెత్తిపైఁ గూరుచుండి యాడించుచున్నది. మిథ్యాప్రేమ నాయందును, హృదయగతమగు ప్రేమ యామెయందు నున్నది. ఇఁక నా కోరిక తీరు టెక్కడ?" అని నిష్ఠురము లాడఁగా శివుఁ డామెను చేరఁదీసి "ప్రియా! నేఁ డీ నిష్ఠురములేల? ఎప్పుడైన నీవడిగినది కాదంటినా? ఏమి కావలయునో యడుగు" మనెను.

అంత పార్వతీదేవి "యార్యా! మిశ్రపూర్వమగు కథ నొకదానిని జెప్పుఁడని యెన్నిసారు లడిగితిని! మీరు చెప్పితిరా? నాయందు మీ కనురాగమున్నఁగదా చెప్పుటకు? ఇప్పుడైన నీ యుల్లాస సమయమున వీనులవిందుగా నొక కథ వినిపింపుఁ" డని ప్రార్థింపఁగా శివుఁడు జాలిచెంది "సతీ! అట్లే కానిమ్ము. దేవతలు కేవలము సుఖపరాయణులు. మానవులు దుఃఖైకజీవులు. ఇట్టివారి కథలలో నెట్టి సారముండదు. కావున సుఖదుఃఖాత్మకమును, సారవంతమును నగు నీ ద్వాఃస్థులకథఁ జెప్పెద. సావధానముగ నాలింపు" మని నుడివి, ద్వారపాలకు రాపిలిచి, ఎట్టివానికిని బ్రవేశ మీయరాదని కట్టడచేసి యంపి కథ చెప్పుట కుపక్రమించెను.

ద్వారపాలకుఁడగు నంది యెవరికిని బ్రవేశమీయక జాగరూకతతోఁ గాచుండెను. అట్టియెడ పుష్పదంతుఁడు ప్రభునిఁ గొలుచు వేడుకతో నచ్చటికి వచ్చెను. కాని ప్రవేశము దుర్లభమాయెను. ఎప్పుడు నెట్టి యాటంకములేని యాతనికి

నేఁ డిట్టియుక్తి కలుగుటకు మనమునఁ జింతించి, యెట్లైన లోనఁ బ్రవేశింపఁ దలఁపుఁగొని, యా పుష్పదంతుఁడు యోగ విద్యాప్రభావముచేఁ గాన, సూక్ష్మరూపమునఁ బ్రవేశించి యొకచో దాఁగియుండి కథ వినుచు నానందించుచుండెనే కాని, తన యకృత్యము నెఱిఁగిన యా పార్వతీ పరమేశ్వరులు శపింతురని యైనఁ దలంపలేదు. కథ పూర్తికాఁగానే వచ్చినవిధముననే యాతఁడు వెడలిపోయెను.

అట్లు వెడలినవాఁ డూరకుండక, తన భార్యయగు జయతో సరససల్లాపములాడుచు నా కథను బూర్తిగా వివరించెను. ఆ కథాశ్రవణమునఁ గుతూహలియై మరునాఁడు జయ పార్వతికి సేవలు సేయుచు నామెకుఁ బ్రొద్దుపోవుటకై తనభర్త చెప్పిన కథను జెప్పెను. ఆ కథను విన్న పార్వతి యాశ్చర్యమగ్నయై, తా మేకాంతమునఁ జెప్పుకొనిన కథ యితరుల కెట్లు తెలిసినదా యని సందేహపడఁ జొచ్చెను. అంతకానిచో పరమేశ్వరుఁడే నన్ను మోసగించి యుండ జయకుఁ దెలిసినదాని నపూర్వమని బొంకెనా యని తలంచెను. ఇట్టి తలంపుతోఁ బరమేశ్వరునిపైఁ దన కోపమును జూపుచు "అయ్యా! మంచిపని చేసితిరి. కోరకకోరక, నొక కథ తెలుపుఁడని కోరఁగా, నందఱు పరస్పరము వినోదార్థము చెప్పుకొను సామాన్యకథను వినిపించితిరి. ఇదియేనా మీ ప్రేమ? ఇది మోసముకాదా? ఇంతకంటెఁ జెప్పక యూరకుండరాదా?" యని నిందించుచుండ శివుఁడు, "ప్రియా! నిష్ఠురములేల? ఈ కథ యపూర్వము కాదని యెవరనిరి?" అని ప్రశ్నింపఁ బార్వతి, "ఒకరని చెప్పనేల? మీరు చెప్పినట్లే మార్పులేక జయ నాకీ కథను జెప్పినది" యనఁగాఁ బరమేశ్వ

రుఁడు యోగదృష్టిచే నిజమారసి, "కాంతా! నే నెప్పుడైన ననత్యములు పలుకుదునా? నా యీ కథ యపూర్వమే! కాని నిన్న నేకాంతమున నీకుఁ గథఁ జెప్పునప్పుడు నందిచే నడ్డగింపఁబడిన పుష్పదంతుఁడు యోగమాయచే నదృశ్యుఁడై ప్రవేశించి, విని యుండెను. అతఁ డీ జయకుఁ జెప్పినాఁడు. ఆమె నీకుఁ జెప్పినది" అనఁగానే కుపితయై పార్వతి పుష్పదంతుని రావించి, "యోరీ మూర్ఖుఁడా! మే మేకాంతమున నున్నప్పు డంతఃపురమును మాయచేఁ బ్రవేశించితివి. అంతియకాక, యచ్చటి కథాలాపములు నీ యిష్టమువచ్చిన యితరులకుఁ జెప్పుచున్నావు. ఇట్టి నీవు మా సేవకుఁ డగవు. భూలోకమున మనుష్యుఁడవై పుట్టు" మని శపించెను.

ఆ శాపమును విని పుష్పదంతుని హితుఁడు మాల్యవంతుఁ డనువాఁడు పార్వతిని సమీపించి "దేవీ! పిచ్చుకపై బ్రహ్మాస్త్రమనిన ట్లీయల్పునిపై నిట్టి ఘోరదండనము విధింప న్యాయమా? సేవకుఁ డెఱుఁగక చేసిన తప్పిదమును దా మనుగ్రహింపవలయు"నని

తప్పిదమును లేశముగా నెంచుచున్నావా? నా నిషేధము నిట్లు మాటలాడుటకు నీకు సిగ్గైనను లేదా? దుష్టుఁడా! నీవును వానివలెనే మానవుఁడవు కమ్మని శపించెను.

ఇంతయు వినుచు గడగడ వడఁకుచుఁ దనగతి యేమగునో యని భయపడుచున్న జయ పార్వతి పాదములపైఁబడి "అమ్మా! పెంచిన వృక్షమును ఛేదింపవచ్చునా? అది విషతుల్యమే యగుఁగాక! నాయందలి యవ్యాజకృపా విశేషమైన నెంచి, వారిని క్షమింపరాదా? తల్లీ! మీ రలిగిన లోకములే

క్షయములగును. మావంటివారా నిలుచుట? మీ యనుగ్రహమే మాకు రక్ష. మీ యాగ్రహమే మా వినాశనము. అనుగ్రహింపుఁడు"ని వేఁడుకొనెను. అంతఁ బార్వతి జాలి చెంది. "ఓరీ! నా శాపము వ్యర్థకాదు. మీరు మానవులై జనించియే తీరవలయును. పుష్పదంతుఁ డీ కథను, కుబేర శాపముచేఁ బిశాచమైన కాణభూతికి వినిపించిన శాపవిముక్తి యగును. మఱియు నాతని దర్శనముచే వీనికిఁ బూర్వజన్మ జ్ఞానము కలుగును. కాణభూతి యనంతర మీ కథను మాల్యవంతునకు వినిపించి, యతఁడు రచింపఁగా విని తన పూర్వరూప మందును. ఇఁక మాల్యవంతుఁ డీ కథను భూలోకమున స్థాపించుటచే శాపవిముక్తుఁడై మమ్ముఁ గలసి కొను" నని యవసానములఁ దెలిపెను. అట్లు రచించినతోడనే వారిరువురు మఱుఁగువడిరి.

పుష్పదంతుఁడు కౌశాంబీనగరమున, వరరుచి, కాత్యాయన నామములతోడను, మాల్యవంతుఁడు సుప్రతిష్ఠితమున గుణాఢ్య నామముతోడను దమశాపము లనుభవించుటకు మానవజన్మము లెత్తిరి.

# కఠినపదముల కర్థములు; ప్రశ్నలు.

## వరరుచి

౧

ప్రతిఘటించి = ఎదిరించి; అభ్రంకషము = ఆకాశమును ఒరయునది (అంటునది); కలశసంభవుఁడు = అగస్త్యమహర్షి; మలికలు = వంకరలు; అపగత = పోయిన (విడిచిన); కతిపయ = కొన్ని; పాంథులు = బాటసారులు; లంబోదరము = వ్రేలాడుబొజ్జ; ప్రోక్తము = చెప్పఁబడినది.

### ప్రశ్నలు

1. వరరుచి కింకొక పేరేమి? అతఁడు సంచరించిన వింధ్యారణ్యమును వర్ణించుమనది.
2. ఆతఁ డా యరణ్యమున కేల వచ్చెను?
3. వరరుచి కాణభూతుల సమావేశ మెట్లయ్యెను?
4. కాణభూతి తన పైశాచిక భావమునుగూర్చి యేమని తెల్పెను?

అరిదుర్భేద్యము = శత్రువులకు భేదింపరానిది; దేవాయతనము = గుడి; యజనము = యజ్ఞము చేయుట; యాజనము = యజ్ఞము చేయించుట; ఛాత్రులు = శిష్యులు; క్రంత = సందు; శ్రుతధరుఁడు = వినినంతనే నేర్చువాఁడు.

### ప్రశ్నలు

1. వరరుచి తలిదండ్రు లెవరు? తల్లి యాతని పోషించుట కేల కష్టపడినది?
2. వరరుచి శ్రుతధరుఁడని వ్యాడీంద్రదత్తు లెట్లెఱిఁగిరి?
3. వ్యాడి వచించిన స్వీయచరిత్ర వివరించుమనది!

అవధి = గడువు; నిమగ్న = మునిఁగిన; వైశద్యము = నేర్పు; మథన = కలఁచు; ధిక్కారముచే = ఎదిరించుటచే; ఉత్పలాక్షి = కలువలవంటి కన్నులు గలది; (స్త్రీ); కూర్కు = నిద్ర; ధౌతాంబరము = తెల్లనివస్త్రము; కుక్కుటములు = కోడిపుంజులు; అరుణదీధితి = ఎఱ్ఱనికాంతి; అస్తవ్యస్తము =

తాలుమాలు; సబ్రహ్మచారులు = సహపాఠులు; నభము = ఆకాశము; మంచు గుబ్బలి = హిమవత్పర్వతము.

## ప్రశ్నలు

1. ఉపవర్షునికీర్తి యెట్లు వ్యాపించెను?
2. వరరుచి కుపకోశతో నైన వివాహము వివరించునది?
3. వరరుచి తపసుసేయుట కేలపోయెను?

మందానిలుఁడు = పిల్లగాలి; పుష్పరజస్సు = పుప్పొడి; పాండుశ్యామ మనోహరాంగి = తెల్లని, చిక్కని, అందమైన శరీరము కలది; నువ్వలువ = కట్టువస్త్రము; కుసుమేతరము = పూవుకంటె వేరైన; యామము = జాము; న్యాసధనము = ఇల్లడ యుంచిన ధనము; బోషాణము = పెద్ద పెట్టె, అర్ధచంద్ర ప్రయోగములు = మెడత్రోపుల్లు; కన్నగాఁడు = దొంగ, చేడియ = ఆఁడుది. వేల్పు = దేవత.

## ప్రశ్నలు

1. ఉపకోశ నాశించినవా రెవరెవరు? వారి కేమని యామె సమాధానములు చెప్పెను?
2. ఉపకోశ యేయుక్తిచే తన్నాశించినవారినుండి తప్పించుకొనెను?
3. భూపాలుని యాస్థానమున సత్యమెట్లు స్థాపింపఁబడినది?

౫

ఆనందకందళిత = ఆనందముచేఁ జిగిర్చిన; సువర్ణములు = బంగారు నాణె

మరల బ్రతికినవాఁడు; ఆనందడోలికలు = సంతోషమను ఉయ్యాలలు; జాగు = ఆలస్యము; జవరాండ్రు = యువతులు; తుచ్ఛము = నీచము; పాటవము - సామర్థ్యము; పారితోషికములు = బహుమానములు.

## ప్రశ్నలు

1. గురుదక్షిణ చెల్లించుటకు వ్యాడీంద్రదత్తవరరుచులు ఎవరినాశ్రయింపఁ దలఁచిరి? కడ కేమాయెను?
2. నందునిమరణమును పిన్న మున్నగు అంశలను చేసిన మంత్రాంగ మేమి?
3. ఆ మంత్రాంగ మెట్లు ఫలించెను?

4. నందుఁడు వరరుచి నేల మంత్రిగా స్వీకరించెను?

5. వ్యాడి యింద్రదత్తునికి బోధించిన నీతియేమి?

లాలసుడు = ఆసక్తిగలవాఁడు; భుజస్కంధములు = భుజముల నెడి బోదెలు; గూఢచారి = రహస్యముగా తిరిగి విషయముల సేకరించు సేవకుఁడు; నిత్య, నైమిత్తికకార్యములు = ప్రతిదినము విధిగా చేయునట్టిది, కారణాంతరమునఁ జేయఁదగినట్టిదియగు వైదికకార్యములు; జాలకము = కిటికి; శుష్కమీనము = ఎండుచేఁప; నిశీథిని = అర్ధరాత్రి; వసువనము = బహుమానము; జఘనప్రదేశము = మొల; నేలమాలె = భూగృహము.

## ప్రశ్నలు

1. శకటాలుని విడుదల యెట్లయ్యెను?

2. వరరుచి గావించిన ప్రజ్ఞాకార్య మేమి? దానివలనఁ గలిగిన ఫలమేమి?

3. బ్రాహ్మణుని వధింప రాజాజ్ఞాపింపఁ గారణమేమి? ఆ యాజ్ఞ యేల నిలుపఁబడెను?

4. శుష్కమీనహాసమునకుఁ గారణమేమి?

5. వరరుచి నేలమాలెలో వసింపవలసిన పరిస్థితి యేల కలి

రాత్రించరుఁడు = రాక్షసుఁడు; నిశాచరుఁడు = రాక్షసుఁడు; విస్మయము = ఆశ్చర్యము; అంధకూపము = చీఁకటి బావి; అశేష శేముషీమహనీయుఁడు = ఎక్కువ జ్ఞానమును కలిగినవాఁడు; విస్రంభ సంభాషణములు = మైత్రీ పూర్వకమగు సల్లాపములు; గీర్వా......ప్రవాహా:—దేవతాస్త్రీల ఉరోజములపైనున్న కుంకుమధూళితోఁ గూడిన ప్రవాహము కలదానా; మదన......అలంకారి = మన్మథునిఁ గాల్చిన అగ్నితోడి నొసటికన్నుగల శివుని దట్టమయిన జడలకు అలంకారమైనదానా; మహాబలి......ఉద్భవ = బలిచక్రవర్తిని నిర్బంధించుటయందు నేర్పుగల త్రివిక్రముని ఆకాశభాగమును కొలుచునట్టి రెండవ పాదము నుండిపుట్టినదానా; సకలకల్మషవిదూర = పాపములఁ బోగొట్టుదానా; నిత్యపాండురశరీర = ఎప్పుడును తెల్లని దేహముకలదానా; సకలజల జంతువిహారప్రదేశ = జలజంతువుల కన్నిటికి విహారభూమియైన దానా; అగణిత......రంగ = లెక్కలేని మణులకు స్థానమైన సముద్రుని యర్ధదేహము నాక్రమించుకొనినదానా; సారీకృత, ఆర్యావర్త ప్రదేశ =

ఆర్యావర్తదేశమును (హిమాలయ వింధ్యాద్రుల మధ్యప్రదేశము) సారవంతముగ చేయుదానా.

## ప్రశ్నలు

1. వరరుచికిని రాక్షసునికిని స్నేహమెట్లాయెను?

2. శకటాలుఁడు వరరుచియం దెక్కు డభిమానము కలిగియుండుటకుఁ గారణమేమి?

౮

దుశ్శీలుఁడు = చెడ్డగుణములు కలవాఁడు; మలయుచు = తిరుగుచు; భల్లూకము = ఎలుఁగుబంటి; ఆకాపాశము = ఆశయనెడి దారము; క్షుధా = ఆఁకలి; అంకస్థలము = ఒడిప్రదేశము; వ్యాఘ్ర + ఉపదేశము = బెబ్బులి యుపదేశము; ఉదంతము = విషయము; మనికిపట్టు = నివసించు చోటు; అపస్మారము = మతిభ్రంశము (పిచ్చి).

## ప్రశ్నలు

1. హిరణ్యగుప్తుఁ డెట్టివాఁడు? అతఁడు వటవృక్షముపై నివసించుటకుఁ గారణమేమి?

2. ఎలుఁగుబంటి పెద్దపులుల సంభాషణమును వివరించునది!

3. రాజకుమారునికి శాపమేల కలిగెను? ఆ శాపమేమి? దానివిముక్తి మార్గ మెయ్యది?

౯

చికిత్సలు = వైద్యములు; నివారణ + ఉపాయము = పోఁగొట్టు ఉపాయము; వంత = విచారము; అంగలార్చు = దుఃఖించు; రుజ = రోగము; ఆరాటము = కలఁత; ఉనికి, మనుకులు = ఉండుచోటు, జీవనములు; స్వర్ణస్తేయి = బంగారు దొంగిలించువాఁడు; ఖిన్నవదనుఁడు = విచారముతోఁడి ముఖము కలవాఁడు.

## ప్రశ్నలు

1. కుమారుని యపస్మారవిషయమున యోగనందునికిని, శకటాలునికిని జరిగిన సంభాషణము వివరించునది.

2. వరరుచి రాజకుమారుని యపస్మారము నెట్లు పోఁగొట్టెను?

౧౦

అంతరాయము = అడ్డు; నిష్కంటకము = ముండ్లులేనిది (అడ్డులేనిది); రోచులు = కాంతులు; దక్షుఁడు = నేర్పరి; పండితమ్మన్యుఁడు = పండితుఁడు

కానివాఁడు; క్రోధ + ఉద్రిక్తుఁడు = కోపముచే ఉద్రేకము కలవాఁడు; కేశబంధము = జుట్టుముడి; దండతాడిత భుజంగము = కఱ్ఱచే మోఁదఁబడిన పాము; పూరి = గడ్డి; వింజమాఁకిడినయట్లు = వింధ్యపర్వతము (సూర్యచంద్రుల సంచారమును) అడ్డగించినట్లు.

## ప్రశ్నలు

1. చాణక్యశకటాలులకు స్నేహమెట్లు కలిగెను?
2. రాజును దండించుటకు చాణక్యుఁడు కోరిన నిబంధనలేవి?
3. అవి యెట్లు నెఱవేఱినవి?

౧౧

క్షపణకుఁడు = బౌద్ధసన్న్యాసి, నిష్కృష్టపు = నీచపు; బేలజోగి = అమాయకుఁడగు తపసి.

## ప్రశ్నలు

1. నందనాశనమును వివరింపుఁడు?
2. గుహాయందలి తపస్వికి పరరుచి చేసిన హితబోధ యేమి? ఏల చేసెను?

## గుణాఢ్యుఁడు

౧

శివప్రోక్తము = శివునిచేఁ జెప్పఁబడినది; అనిమానము = రాక; ప్రతీక్షించి = ఎదురుచూచి; రాకాచంద్రుఁడు = పున్నమ చంద్రుడు; ఎఱుక = జ్ఞానము; చక్షువు = నేత్రము; అభిధానుఁడు = పేరుకలవాఁడు; నాదము = శబ్దము; నవనవ + ఉన్మేష = క్రొంగ్రొత్తగా వికసించు; కలంకము = మచ్చ; కుఠారము = గొడ్డలి.

## ప్రశ్నలు

1. కాణభూతి తన శాపావసానకాలము సమీపించినదని యెట్లు తెలిసికొనెను?
2. గుణాఢ్యుని జన్మవృత్తాంతము వివరింపుఁడు?

ముదితుఁడు = సంతసించినవాఁడు; తిరోగమనము = మరలి వచ్చుట; మల్లవిద్య = కుస్తీ; వణిక్కుమారులు = కోమటి బిడ్డలు; త్రోవ = దిక్కు; వాడ = వీథి; పణ్యాంగనలు = వేశ్యలు; కక్ష్యాంతరములు = తొట్టికట్టులు;

(ఇంటి భాగములు); సాగరవీచులు = సముద్రపుటలలు; గౌరీశుఁడు=శివుఁడు; అర్భకుఁడు = పిల్లవాఁడు; ఔరసుఁడు = కన్నకుమారుఁడు; బాలభానుఁడు = లేఁతసూర్యుఁడు; సింహిక = ఆఁడుసింహము.

## ప్రశ్నలు

1. గుణాఢ్యుని బాల్యము, విద్యాభ్యాసము, సాతవాహన రాజదర్శనమును వివరించునది?
2. సాతవాహనుఁడెనుకనే రారాజున కేల కలిగెను?
3. సాతుని శాపవృత్తాంతము వివరించునది!

3

అంగనలు = స్త్రీలు; జలయానములు = పడవలు; రొద = శబ్దము; కలకంఠము = కోకిల; విశారద = చక్కఁగా నెఱిఁగినది; ప్రహసనము = హాస్యమును కలిగించునది; మహానాగము = గొప్ప పాము; వితరణ - వదాన్యత (దానగుణము); వాత్సల్య గౌరవ + అతిరేకము = ప్రేమ, గౌరవముల యతిశయము; అపరిపక్వ = సంస్కారములేని; వ్యాఖ్యానించి = భావములు వివరించి; దీనాలాపములు = దీనములగు మాటలు.

## ప్రశ్నలు

1. సాతవాహనుఁ డెట్టివాఁడు? అతని నెవరేల గేలిచేసిరి?
2. సాతవాహనుని విచారము పోఁగొట్టుటకు మంత్రులేమని యనునయించిరి?
3. వారి యనునయములకు రాజేమని ప్రత్యుత్తర మిచ్చెను?
4. శర్వవర్మ గుణాఢ్యుల ప్రతిజ్ఞలను వివరించునది.

౪

క్లేశము = కష్టము; కటాక్షము=కడకంటి చూపు; అంబరము = వస్త్రము.

## ప్రశ్నలు

1. శర్వవర్మ కుమారస్వామిచే నియముల నెట్లు పడసెను?
2. సాతవాహనుని పూర్వజన్మ వృత్తాంతము వివరించునది?
3. కాణభూతి గుణాఢ్యుని గోరినదేమి!

౫

అగ్రహారము = బ్రాహ్మణకుటుంబములుండు గ్రామము; వైశ్వానరుఁడు = అగ్ని; కనలి = కోపించి; ప్రాసాదము = మేడ; నిర్గమించి = వెడలి; ఇల్లడ

కాపాడుటకై యొకనియొద్ద దాఁచుట; అభ్యర్థనము = కోరిక; ఉచితజ్ఞుఁడు = సమయమునకు తగినది తెలిసినవాఁడు; తెంపరితనము = సాహసము; సాంత్వనవాక్యములు = ఓదార్పు మాటలు.

## ప్రశ్నలు

1. గోవిందశర్మ యెట్టివాఁడు? అతని కుమారులెట్టివారు?
2. గోవిందశర్మకుఁ గుమారులపై నేల విసుగు కలిగెను?
3. శ్రీదేవి చేసిన సైఁగ యేమి? అది దేవదత్తున కెట్లు తెలిసినది?
4. దేవదత్తుఁడు శ్రీదేవిని వివాహమాడిన విధము వివరింపుము.

౬

శంభుఁడు = శివుఁడు; అవ్యాజ కరుణాకటాక్షము = కారణములేని దయతోడి కడకంటి చూపులు; మనోహ్లాదకరము = మనసునకు సంతోషము కలిగించునది; వినయవినమితులు = అడఁకువతో నణఁగినవారు; వమ్ము = వృథా; మహీరుహములు = అడవిదున్నలు; మస్తకములు = మాదపు టేనుఁగులు; సారంగములు = జింకలు.

## ప్రశ్నలు

1. మాల్యవంతుఁడను పేరాతని కెట్లు కలిగెను?
2. బృహత్కథ దేనితో వ్రాయఁబడినది? ఏల?
3. ఆ కథను భూమిలో స్థాపించుటకు గుణాఢ్యుఁ డేమి చేసెను?
4. కడకది యెట్లు స్థాపింపఁబడెను?

## శాపకారణములు

పూర్వాపరసముద్రములు = తూర్పు పడమటి సముద్రములు; వాసి = ప్రఖ్యాతి.

## ప్రశ్నలు

1. పార్వతీపరమేశ్వరులయొద్ద పుష్పదంతుఁ డెట్టి గౌరవము నందుచుండెను?

2. పార్వతీ పరమేశ్వరు లేల యేకాంతమున నుండిరి?

3. పార్వతి పుష్పదంత మాల్యవంతులకు శాపము లొసఁగఁ గారణము లేమి?

4. వారి శాపావసానములను వివరింపుము.